# కొత్త లోకాలు

[ నాటికలు ]

రచయిత :

ఎన్. ఆర్. చందూర్

పబ్లిషర్సు :

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# విషయసూచిక

# కొత్తలోకాలు

అతను మంచి పేరుప్రతిష్ఠలుగల డాక్టరు. హస్తలాఘవం మంచిదంటారు లోకులు. దేహదౌర్బల్యాలూ మానసిక రుగ్మతలూ కుదర్చగల సమర్థుడు. వయసు 37.

సాయంత్రం నాలుగున్నర గంటలవేళ.

విశాలమైన గదిలో మధ్యని పెద్ద మేజాబల్ల వుంటుంది. నాలుగుల వైపున డాక్టరుకుర్చీ, మేజాకి ఆవలి తట్టున ఒక సోఫా, చెరోపక్కనా ఒక్కొక్కకుర్చీ. డాక్టరుకి అందుబాటులో పెద్ద బుక్‌షెల్ఫ్ ఎన్నో పుస్తకాలతో వుంటుంది. రామకృష్ణ పరమహంస పటం డాక్టర్‌కి ఎప్పుడూ ఎదురుగా కనిపిస్తూ వుంటుంది.

ఈ డాక్టరు టేబిల్‌మీద స్టెతస్కోపుగానీ, ఇంజక్షన్ ట్యూబులుగానీ, హాండ్ బాగ్‌గానీ, కాటన్‌రోల్స్‌గానీ కనిపించవు. యాష్‌ట్రే వుంటుంది. ఇంక్‌స్టాండ్ లేదు. వెనకతట్టున రేడియో.

డాక్టర్ తెల్లటిపంచె బంగాళీ కట్టు కట్టుకొని వుంటాడు. సిల్కులాల్చీ పొడుగాటిది వేసుకుంటాడు. కళ్ళజోడు వుండదు. వంకులజుట్టుకాదు; మన్నటిక్రాపు.

తెర ఎత్తేటప్పటికి తన కుర్చీలో కూచుని ఆనాటి పేపరు చదువుకుంటున్న డాక్టర్ కనిపిస్తాడు. అప్పుడే స్నానంచేసివచ్చి కూచున్నవాడిలా వుంటాడు.

క్షణకాలం పేపరు అటూ యిటూ తిరగేసి రేడియోవద్దకివెళ్ళి ట్యూన్‌చేస్తాడు. కాసేపు అది విని, ల సంగీతం భరించలేక ఆపేస్తాడు. టేబిల్‌కి అమర్చబడి వున్న ఎలెక్ట్రిక్ కాలింగ్‌బెల్ నొక్కుతూ తిరిగీ కుర్చీలో కూచుంటాడు. మోగిన గంట శబ్దం.

[సంభైఏళ్ళ నౌకరు వెంకన్న ప్రవేశం]

వెంకన్న—ఏం బాబుగారూ!

డాక్టరు—ఒక కప్పుస్ట్రాంగు కాఫీ తీసుకురా...ఎక్క ణ్ణుంచి? విశ్వరావు హోటల్నుంచి వద్దు; దామోదరయ్యారు

దగ్గిర్నుంచి తీసుకురా...ఫ్లాస్కు శుభ్రంగా కడిగి పోయించుకు రా...జల్దీ.

వెంకన్న కదలబోతూ వుండగా ఆనందమోహన్ ప్రవేశిస్తాడు. ఆనంద మోహన్ వయసు 23. హనావా సూటు వేసుకుంటాడు. టై, హాటూ వుండవు. మొహంలోని దీనత్వాన్నీ, దిగులునీ ఖరీదుగల అతని సూటు దాచలేకపోతుంది, డాక్టర్‌కి ఎడమవైపున వున్న కుర్చీలో చతికిల బడతాడు.

డాక్టరు—(వెంకన్నని వుద్దేశించి) రెండు కప్పులు ఒక గోల్డ్ ఫ్లేక్ పాకెట్ కూడాను.

డాక్టర్ సొరుగులోనుంచి పర్సు తీసి ఒక రూపాయినోటు వెంకన్నకి యిస్తాడు. వెంకన్న నిష్క్రమణ.

డాక్టరు—(వెంకన్న వెళ్ళిపోయినతర్వాత) త్వరగా రావాలి, అక్కడే నిద్రపోకు.

ఆనందమోహన్—నాకు కాఫీ ఎందుకు తెప్పిస్తున్నారు?—అఖ్కర్లేదు. ఏమీ తినాలనిగానీ, ఏమీ చెయ్యాలని గానీ ఆసక్తి లేదు.

డాక్టరు—నీలాంటి యువకుల్ని ఎంత రెందర్నో చూశాను. కాని, వారెవరిమీదా కలగని అభిమానమూ అనురాగమూ నీ మీద కలుగుతున్నాయి చూస్తున్నావా?—కుర్రతనం వల్ల నీకింకా గోచరం కావడంలేదు!—మనుషులు ఎంత దుర్బలులో! రోగి లక్షణాల్ని బట్టి డాక్టరు ఎన్నో గ్రహించగలడు; కాని, గ్రహించిన ఘాటిలో రోగికి ఎన్ని చెప్పడానికి వీలవుతుంది?

ఆనందమోహన్—అయితే రోగికి అతని రోగం చెప్పరా ?

డాక్టరు—రోగికి అతని రోగం చెప్పడం అనవసరం. ఆ రోగాన్ని మాన్పగలిగే మందివ్వాలి.

ఆనందమోహన్—మీ రోగాలగొడవ నాకెందుకు పోనిద్దురూ! జీవితానికి మెరుగు నివ్వగలిగే సానపెట్టిన వజ్రాన్ని పోగొట్టుకున్న నాకు మిగతా విషయాల జోలెందుకు ? మాధవి లేని బతుకెందుకు ?

డాక్టర్ పెదవులమీద చిరునవ్వు కనిపిస్తుంది. మోహన్ వీపు తట్టుతాడు. కాని, ఆ యువకుని ముఖ కవళికలో మార్పేమాత్రమూ తీసుకురాలేకపోతాడు.

డాక్టర్—నువ్వు ఈ గండం గడిచి గట్టెక్కితే మాధవి లాంటి పిల్లలు, మాధవిని మరిపించే పిల్లలు ఎందరు కని పిస్తారో ! మాధవితోనే ఈ ప్రపంచమంతా వుందా ?

ఆనందమోహన్—నా ప్రపంచమంతా మాధవి లోనే !

డాక్టరు—నీది ప్రథమయవ్వనం. పొంగేపాలలో నీటి బొట్లు రాల్చకపోతే అగ్నిలో పడతాయి.

ఆనందమోహన్—ఆ పొంగులోని ఆరాటంవల్ల కలిగే తీవ్రతతో బాధపడటంకంటె పొర్లి అగ్నిలో ఆహుతి అయి పోవడమే తేలిక. నా పంచప్రాణాలూ మాధవిమీద పెట్టు కున్నాను. ఆమె నాది కాక పరులది అయిపోతోంది... అలాంటప్పుడు నేను బతకటం దేనికి ?

నౌకరు వెంకన్న ఫ్లాస్కూ, రెండుకప్పులూ, సిగరెట్టు పాకెట్టూ తీసుకు వస్తాడు. డాక్టర్ కప్పులనిండా కాఫీపోసి సిగరెట్టు అందిస్తాడు. పరధ్యానంలోవున్న ఆనందమోహన్‌కూడా సిగరెట్టు వెలిగిస్తాడు. ఇద్దరూ నిశ్శబ్దంగా కాఫీ తాగుతారు. అంతసేపూ వారిద్దర్నీ పరకాయించి చూస్తూ నుంచున్న వెంకన్న కాఫీ కప్పులూ ఫ్లాస్కూ తీసుకొని నిష్క్రమిస్తాడు.

ఆనందమోహన్—డాక్టరుగారూ, మీరు నా కంటె బాగా చదువుకున్నారు. ఎక్కువ అనుభవం వుంది. ఎన్నో గ్రంథాలు చూశారు. చాలా దేశాలు తిరిగారు. ఎందరో ప్రముఖులతో పరిచయం వుంది. బతుక్కి అర్థం ఏమిటండీ!

డాక్టర్—(సీరియస్‌గా) నాకు మాత్రం ఏం తెలుసు?

ఆనందమోహన్—తెలుసుననుకొన్నాను.

డాక్టర్—పొరబడ్డావు, మోహన్ నాకు తెలిసినంత వరకూ చెప్తాను. బతుక్కి అర్థం మరణమని మాత్రం కాదు. ఏ అవమానంలోనూ, ఏ తృణీకారం లోనూ, ఏ తీవ్ర నిస్పృహాలోనూ, ఏ ఘోర అపజయంలోనూ, ఎవడయితే నిబ్బరంతో మరణాన్ని కోరుకోడో వాడే పురుషుడు. జీవిత పురుషార్థం వానిదే!

ఆనందమోహన్—డాక్టరుగారూ, మీరు సత్యాన్ని మరుగుపరుస్తున్నారు.

డాక్టర్—లేదు, ఆనంద్.

ఆనందమోహన్—ఎన్నో విషయాలు నాకు నేను నిశ్చ యించుకోగలను. ఈ విషయంలో మాత్రం మీ సలహా తీసుకొని, ఆ ప్రకారం ఆచరిద్దామని నాకోరిక.

డాక్టర్—ఆదర్శాలూ, అభిప్రాయాలూ వొదిలేసి, యింతకీ ఏం జరిగిందో చెప్పు.

ఆనందమోహన్—మాధవిని నేను ప్రేమించాను. నన్నూ మాధవి ప్రేమిస్తోందని, చాలా కాలం దాకా— యివ్వాళ మధ్యాహ్నం రెండుగంటల దాకా — అను కున్నాను. ఇప్పుడు కూడా మాధవి ప్రేమగురించి నేను నిశ్చయంగా చెప్పలేను. నాకు ఎక్కువ ఆస్తీ ఆదాయమూ లేవు కనక, మాధవి తండ్రికి ఆమెని డబ్బు దిట్టంగావున్న ఒక పెద్దప్లీడర్కి యివ్వాలనివుంది.

డాక్టర్—భేష్ ! సమస్య అంటే ఎప్పుడూ అలాగే వుంటుంది. తండ్రులు కుమార్తెల యిష్టప్రకారం పెళ్ళిళ్ళు చేస్తే యిన్ని నాటకాలూ, సినిమాలూ, కథలూ ఎలా తయారవుతాయి ! మాధవి ఏమంటుంది ?

ఆనందమోహన్—'మానాన్న చెప్పినది నిజమే ! డబ్బు లేకపోతే ఎలా ? మన మిద్దరమూ ఆదర్శ స్నేహితు లలా వుందాం, నేనా ప్లీడర్నే పెళ్ళిచేసుకుంటాను !' అంది.

డాక్టర్—బలేప్రేమ, భాయీ. గొప్ప నెచ్చెలిని సంపా యించావ్ !

ఆనందమోహన్—మీరు నవ్వించాలని వేళాకోళం చేస్తున్నారు. మాధవిలేని నా బతుకు గిలాబా చెయ్యని గోడలాంటిది కదూ !

డాక్టరు—లేచి వచ్చెయ్యమనక పోయావూ ?. తండ్రి కొన్నాళ్ళు గాలితో పోరాడినా, చివరికి తిరిగి వచ్చే

వాడు. మాధవికి నిన్ను పతిగా స్వీకరించేందుకు, ధయిర్య మయినా వుండాలి, — నిజమైన ప్రేమ సూచాయిలకీ, చీరెలకీ, జడిపింపులకీ లొంగిపోదు. లేదా, నీకు ఆమెను మర్చిపోగలిగే చిత్తస్థయిర్యమయినా వుండాలి — స్త్రీ తన ప్రేమధనాన్ని ఎంతైనా వొడ్డి కాపాడుకుంటుంది. ఈ రెండూ మినహా వేరు దారులు లేవు.

కాల్చిన సిగరెట్లు యాష్ట్రేలో పారేస్తాడు యిద్దరూను.

ఆనందమోహన్—మాధవి నిజంగా నన్ను ప్రేమించ లేదా ?

డాక్టరు—నేను చెప్పను. అది నీకు అనుభవం కావల సిన విషయం. నేను చెప్పినా నువ్వు నమ్మలేవు.

ఆనందమోహన్—నమ్ముతాను-చెప్పండి.

డాక్టరు—నీకు ఒక కథ చెప్తాను, విను. నీవయసులోనే నేను వున్నపుడు, నీకుమల్లేనే వెర్రిగా నేనూ ఒక పిల్లని ప్రేమించాను. నాకు వరస అయిన అమ్మాయి. కొద్దిగా దూరపుబంధువు. బి. ఎ. పాసై, మాస్కో పట్టుకున్న నెపోలియన్‌లా, ఫీలవుతున్న రోజులవి. హద్దూపద్దూ లేని వెర్రివ్యామోహమది. మంజరి ఎదురుగా లేనిదే అన్నం సయించేది. కాదు; మంజరి కనిపించందే క్షణం గడిచేది కాదు; మంజరిమాటలకి మించిన మాధుర్యం మరెక్కడా వున్నట్లులోచేది కాదు. గడియారపుముల్లు గిర్రున తిరిగేది; సూర్యుడు చూస్తూచూస్తూవుండగానే అస్తమించేవాడు;

కాలచక్రంలోని ఆకులు లెక్కించడానికి శక్యమయేది కాదు. మంజరికి పదిహేడేళ్ళు; పెళ్ళిఅయింది—యింకా కాపరానికి వెళ్ళలేదు.

ఆనందమోహన్—అయితే మీరు వివాహితని ప్రేమించడం ప్రారంభించారు.

డాక్టరు—వివాహం ఒక వెఱ్ఱి సూత్రం. అర్థంలేని బంధం. స్త్రీపురుషులు వారివారి స్వలాభాలకోసం ఏర్పాటుచేసుకున్న అనువైనపద్ధతి. నిర్మలమైన ప్రణయం ఎప్పుడూ హృదయాల్ని దగ్గిరిగాచేర్చే ప్రయత్నంలోనే వుంటుంది, అది మానవుడు ఏ కలుషాన్ని సాధిచే స్వార్థప్రయత్నంలోనో ఏర్పాటుచేసిన నియమానికి లొంగదు. అలా లొంగినది ప్రేమే కాదు.

ఆనందమోహన్—మంజరికథ చెప్పండి.

డాక్టరు—మంజరీ నేనూ లోకాన్ని - అందరిలాగానే మర్చిపోయాం. వసంతం చిగురించింది. జగత్తు అంతా మధువుతో తొణికిసలాడింది. సృష్టి మాధుర్యం అనుభవమయింది. దేహాల ఆకలీ, కళ్ళ అల్లరీ తగ్గింది. ఈ మొగ్గల్ని చూసి పూలన్నీ ఫక్కున నవ్వాయి. చిలుకలు చెవుళ్ళు కొరుక్కున్నాయి. నాకు మంజరిలేని జీవితం సిరాలేని పెన్ లాటిది అయిపోయింది. మాయిద్దరి గురించిన స్కాండల్ దినదినప్రవర్థమానమయింది ఆమె తలిదండ్రులకి నేనంటే చాలా అభిమానమూ, మేమంటే చాల నమ్మకమూను.

కాని, ఏ క్షణంలో అయినా తెగిపోవచ్చు ఈ గాలిపటం తాడు!

ఆనందమోహన్—(ఆతురతతో) ఏంచేశారు?

డాక్టరు—తల్లి దేవాలయానికీ తండ్రి క్లబ్బుకీ వెళ్ళగా చూసి, ఒక సాయంత్రం అడిగేశాను మంజరిని—ఎంతకాలమిా దాపరికమని. ఆమె సమాధానం చెప్పలేదు. ఆలోచించి జవాబు చెప్పాలని శాసించాను. నీలినేత్రాలు అయోమయంగా నావంక చూశాయి. ఈనాడయితే ఒకపెళ్ళి అయిన ఆడపిల్లను అలాటి ప్రశ్న వెయ్యనే వెయ్యను.

ఆనందమోహన్—ప్రేమించనే ప్రేమించరేమో!

డాక్టరు—రైట్! నిజమే! ప్రేమించను. పెళ్ళిఅయిన ఆడపిల్లని కాదు—ఏస్త్రీనీ ప్రేమించను. స్త్రీని ప్రేమించడం వల్ల హృదయారాటం ఎక్కువ అవుతుంది. ఫలితం శూన్యం. స్త్రీకి బదులుగా మూఢసంఘాచారాలకి బలి అయిన అనాథల్నీ, మానసికశక్తి లేక పాడైపోయిన పతితుల్నీ, అధికారి దౌర్జన్యపుటినుపులలో నలిగి నశించే దీనుల్నీ ప్రేమించు.

ఆనందమోహన్—మంజరి ఏమయింది?

డాక్టరు—ఇంకా మంజరికథ వినాలనేవుందా? ఒక రాత్రి ఆమెభర్త ఏ లోకం నుంచో వూడిపడ్డాడు. మర్నాడు మధ్యాహ్నం కొత్తచీరె కట్టుకొని కులుకుతూ ప్రయాణమయింది భర్తతో, 'నాగతేమిటి?' అన్నాను. 'నేనేం చేశాను?' అంది. అలాటి జవాబు ప్రేమించిన స్త్రీ దగ్గి

ర్నుంచి పరిగ్రహించడం కంటె తల నరికేసుకోవడం శ్రేష్ఠం. ఇంకా ఏం చెయ్యాలి? నా పవిత్రావర్యాల్నీ, నా అవ్యాజానురాగాన్నీ, నా తీవ్రవాంఛల్నీ మలినం చేసి, యింకా ఏం చెయ్యాలనో, ఏమీ తెలీని సంగశాచిలా అడుగుతోంది ఈ అమ్మవారు! చెయ్యగలిగినదంతా చేసింది. హృదయంలో కారుచిచ్చు పెట్టింది. తన మర్యాద కాపాడుకునేందుకు నా ప్రేమనీ నన్నూ బలియిస్తోంది. వెర్రివాడినై, చూపుల్లోని లోతు గ్రహించే సామర్థ్యం లేక, నా ప్రేమామృతాన్ని ఎండే మోడులో పోశాను. విచారించి ప్రయోజనం లేదు. విషాద వాహినిలో మునిగి పోకూడదు. జాగర్తగా తప్పించుకొని వొడ్డు చేరుకోవాలి. 'నా గుండెల్లో ఆరని అగ్నిహోత్రం పెట్టి వెళ్ళిపోతున్నావ్! ఏనాడో నీ ఆత్మ మేలుకోక తప్పదు. ఆ నాడు అనుభవిస్తావ్—యింతకి పదిరెట్లు,' అంటూ, ఆమె జవాబుకి ఎదురుచూడకుండా, ఈ విశాల ప్రపంచంలోకి నిబ్బరంగా సోల్లాసవచ్చేశాను. ఒక విషయం గురించిన యదార్థతత్వం తెలుసుకోవడం వేరు; అదే విషయం మనకి అనుభవమయినపుడు నడుచుకోవడం వేరు. ఆ దెబ్బతో జీవితదృక్పథమంతా మారిపోయింది. మంజరి తర్వాత ఇంకెవరినీ ప్రేమించలేనేమో అనుకున్నాను,—కాని, ప్రేమించాను,—మంజరి గాయపరిచిన హృదయంతో. విషయవాంఛ అవధిగా పెట్టుకున్న ప్రతిప్రేమా నన్ను నలిపి పారేసింది. జీవితజూదంలో పోగొట్టిపడిన పేకముక్క

కాకూడదనే స్థిరసంకల్పంతో వాంఛాజలధిని దాట నుంకించాను. రోగుల్నీ, దీనుల్నీ, అనాథల్నీ, అభాగ్యుల్నీ, అసహాయుల్నీ, అమాయకుల్నీ ప్రేమించేమార్గం నేర్చుకోనడం మొదలెట్టాను. ఆ ప్రయత్నమే నాజీవిత పరమార్థం. గతించిన ఏవ్యామోహమూ యివ్వలేని శాంతిని ఈ ప్రయత్నానుభవం నాకిస్తోంది.

ఆనందమోహన్ కుర్చీలోనుంచి లేచి ఒక్కసారి హాలంతా పచారుచేసి, మళ్ళీ కుర్చీలో కూచుని, యింకో సిగరెట్టు అంటిస్తాడు. డాక్టర్ కనిపించని దేనినో తదేకంగా చూస్తున్నట్టు వుంటాడు. అతని చూపులో ఆవేశ పటుత్వమూ, అనుభవ చింతనా కనబడ్తాయి.

ఆనందమోహన్—సిగరెట్టు ముట్టించండి.

డాక్టరు పరధ్యానంగా సిగరెట్టు వెలిగిస్తాడు. యాష్ట్రేలో యిద్దరూ సిగరెట్టు దులుపుతూ ఒక నిముషం నిశ్శబ్దంగా వుంటారు.

ఆనందమోహన్—ఆమె యిప్పుడు వచ్చి మీ దగ్గర నిలిచిందనుకోండి—మీరేం చేస్తారు ?

డాక్టరు—ఏమీ చెప్పను.

ఆనందమోహన్—అదెలా ? ఇంత కాలం గడిచిన తర్వాత ఆమెలో పరివర్తన కలిగో, జ్ఞాననేత్రం తెరుపుకి వచ్చో, మరింకే యితర కారణం వల్లనో వచ్చిందనుకోండి.

డాక్టరు—రాదు. ఆమె రాకకోసం నేను పలవరిస్తూ పరితపించడం మానేసిన తర్వాత ఎన్నో వసంతాలువచ్చి వెళ్ళాయి. ఆమె రావాలనే కోరిక నాలో ఈషణ్మాత్రమూ లేదు. అదీకాక, ఆమె వచ్చి నాకేం చెయ్యగలదు ? నదున్న

రామమ్మసాటి కూడా చెయ్యలేదు. ఆమె ప్రపంచం వేరు—నా ప్రపంచం వేరు. విరిగినమనసూ, పగిలినకలశమూ సమానం. ఆమె వస్తుందనే తలంపే నాకు బాధాజనకం. అయినా ఎందుకు రావడం—నాకు నాలుగు మేడలూ నలభై వేలూ, నాలుగువందల ఎకరాలూ లేవుగా! ఆనందమోహన్, నేనెందుకు యిదంతా నీకు చెప్తున్నానంటే, నీ బాధని తగ్గించి, నీ జీవితరథాన్ని నున్నటిబాటమీద నడిపించడానికి నా అనుభవం సహాయపడుతుందేమోనని!

[వెంకన్న ప్రవేశం]

వెంకన్న—ఎవరో అమ్మగారు వచ్చారండి.

డాక్టరు—కాంపవుండర్ రాలేదూ! లేకపోతే నర్సుని చూడమను.

వెంకన్న—మీతోటే మాట్లాడాలటండి.

డాక్టరు—కొత్తకేసా!

ఆనందమోహన్—పేరేమిటో అడిగి రా.

డాక్టరు... పేరు తెలుసుకు ప్రయోజనం ఏమిటి! ఎవరో కొత్తవారైవుంటారు. (వెంకన్నతో) ఆమెను లోనికి రమ్మను.

వెంకన్న వెనక్కి తిరిగేటప్పటికి మంజరి ప్రత్యక్షమవుతుంది, హేండ్‌బాగ్‌తో. వెతల్పాటి నల్లని అంచు కలిగిన కాషాయరంగుచీరె, నల్లచారల తెల్లసిల్కు జాకెట్టూ ధరిస్తుంది. చెవులకి మెరిసే రవ్వల దుద్దులూ, మెళ్ళోని ముత్యాల హారమూ ఆమె ధనధాన్య సంపద కలిగిన కుటుంబం తాలూకు వనిత అని

అంటాయి. కుడిచేతి నాలుగు గాజులూ, ఎడంచేతి నాలుగు గాజుల మధ్యావున్న రిస్టువాచీ ఆమె సాంప్రదాయాన్నీ నాగరీకాన్నీ మిళితంచేసి, రెండింటిలోనూ వున్నా నని ఎలా అనిపించుకోగలదో చెప్తాయి. కాళ్ళకి సాండల్సు. టేబుల్‌మీద వున్న పేపరు తీసుకోబోతున్న ఆనందమోహన్ ఆమెవంక ఒక్కసారి రెప్పవాల్చకుండా చూస్తాడు. ఈ చిరపరిచితురా లెవరా అన్నట్లు డాక్టర్ క్షణకాలంలో స్మృతిపత్రాలు వెనక్కి తిరగేసి, అమితాశ్చర్యంతో మంజరిని విలోకిస్తాడు. వెంకన్న లోపలికి తప్పుకుంటాడు.

డాక్టరు—వచ్చి కూచో.

మంజరి కుడిపక్కని వున్న కుర్చీలో కూచుని, హాండ్‌బాగ్‌లోనుంచి జేబు రుమాలు తీసుకొని, చెమట పట్టకుండా పరిశుభ్రంగా తన మొహాన్ని అలవాటు చొప్పున తుడుచుకుంటుంది.

డాక్టరు—(మంజరితో) ఎక్కణ్ణుంచి ?

మంజరి—నీకు తెలీదా నాకు ప్రాప్తించిన అవస్థ ?

డాక్టర్—(తెల్లబోతూ) ఏమిటా అవస్థ ? అవున్లే—అవస్థలేకపోతే డాక్టర్ దగ్గిరికి ఎందుకు వస్తారు.

మంజరి—ఏ డాక్టరూ సముదాయించలేనిది. ఆయన పోయారు సంవత్సరం కిందట.

డాక్టరు—అలాగా !

మంజరి డాక్టర్ మొహంలోనూ మాటలోనూ మెచ్చదనం కనలేక తికమక పడుతుంది.

మంజరి—ఒక్కగా నొక్క పిల్లవాడు — పాలబుగ్గల బుడతడు—నలిగి వాడిన జీవిత కుసుమానికి వ్యర్థసౌంద ర్యాన్ని కల్పించబోయిన మోహనమూర్తి, ఏ వంక చూసినా తనే అయి, నన్ను వొదిలేసి, తన తండ్రిని చేరాడు. (కంఠంలో జీర కనిపిస్తుంది.)

డాక్టరు—పాపం, ఇద్దరూ కలిసి నీ జీవితాన్ని ఆలంబన రహితంగా చేశారా! గాలిలో గంతులు వేస్తాననే మానవుణ్ణి ప్రారబ్ధం భూమిమీద బస్కీలు తీయిస్తుంది. (ఆనంద మోహన్ వైపుగా తిరిగి) యింతకాలం ఈమె ఎవరో చెప్పడం వుపేక్షచేశాను. ఈమే—చూస్తున్నావా?— ఈమే—మంజరి!!

ఆనందమోహన్—(ఉత్సాహావేశంతో) ఇది మహోత్కృష్టమైన రోజు మన అందరి జీవితాల్లోనూ. ఓహో! ఏమిటీ అనుకోని సమావేశాలు? ఎక్కడికీ అవధి కనిపించని ప్రయాణాలు? ఎందుకు—ఏ అంచుల వెనకనో వున్న సౌందర్యాన్ని అందుకునేందుకీ వెర్రిహృదయాల పరుగులు? ఏమిటి? ఎక్కడికి? ఎందుకు? డాక్టర్‌గారూ, పట్టరాని మత్తెక్కిన ఆవేశంతో, నిలపరాని వేడెక్కిన ఉద్రేకంతో నా హృదయమందిరం లోని ప్రణయాగ్ని ప్రళయతాండవం సలుపుతోంది. ఇది ఒక పుణ్యదినం— గొప్ప పండగ.

డాక్టరు—కట్టలు తెగి ప్రవహించే నదివల్ల ప్రజానీకానికి ఎప్పుడూ వుపద్రవమే కాని ప్రయోజనం లేదు. ఎందుకా వుబలాటం?

మంజరి—ఈయనెవరు, విశ్వాసరావ్?

డాక్టరు—ఆనందమోహన్. అతనంటే నాకు చాలా యిష్టం.

మంజరి—చదువుకుంటున్నారా ?

డాక్టరు—అవును. జీవితమనే పాఠశాలలో.

మంజరి—(చిరునవ్వుతో) ఉపాధ్యాయు లెవరు ?

డాక్టరు—(గర్వంగా) నేను గాక మరింకెవరు ?

మంజరి—భేష్ !

డాక్టరూ, ఆనందమోహన్ సిగరెట్లు వెలిగిస్తారు.

ఆనందమోహన్—(కుర్చీలోనుంచి లేచి) ఇప్పుడే వస్తాను.

డాక్టరు—ఎక్కడికి ? నీ దగ్గిర దాచవలసిన రహస్యాలు లేవు.

ఆనందమోహన్—లేవులెండి—ఇప్పుడే వస్తాను.

డాక్టరు—రావు.

ఆనందమోహన్—నిజంగా వస్తాను. (వెళ్ళిపోతాడు)

డాక్టరు—ఏమిటి కథ—మంజరీ ?

మంజరి—ఏమీ లేదు. భర్తనీ బిడ్డనీ పోగొట్టుకున్న అనాధని. నాకు లోకం ఏ సంతోషాన్నీ యివ్వదని స్థిరంగా తెలుసు. కాని, నేను లోకానికి ఏ విధంగా నన్నా ప్రయోజనకారిని కాగలనా అనే బాధ నన్ను వొదలడం లేదు. నా చిన్న చదువుకీ, స్వల్ప సంస్కారానికీ, సామాన్యానుభవానికీ లొంగని ఈ బాధ నువ్వు నివృత్తి చెయ్యగలవనే ఆశతో వచ్చాను. ఏ ఒక్క జీవికీ ఆనందాన్నీ అమరత్వాన్నీ యివ్వలేకపోయిన నా మనసు కార్చిచ్చుతో మండి నన్ను

జీర్ణింపజేస్తోంది. శాంతి కావాలనే హృదయారాటం మూలమూలలవున్న తరుచ్ఛాయిలకోసం వెతుకుతోంది. ఏం చెయ్యను ?

డాక్టరు—ఏం చెయ్యగలం ? అంబరవీధిలోని రెండు తారకామణులం యిద్దరమూను. ఆ రెండు నక్షత్రాలూ అలా దూరంగావుండి, ఒకదాన్నొకటి ప్రీతితో చూసుకుంటూ, కాలంలేని స్థలంలో నిర్గమప్రయాణం చెయ్యాలి. అలా కాక ఈ మింటిచుక్కలు ఒకదానికొకటి దగ్గిరిగా రావాలని ప్రయత్నించాయా, రాపిడివల్ల స్థానభ్రష్టత్వమూ వినాశమూ కలగవూ !

మంజరి—ఇద్దరమూ కలిసి ఉడురాజుని వేడుకుందాం.

డాక్టరు—వినడేమో !

మంజరి—వినిపిద్దాం.

డాక్టరు—మంజరీ !

మంజరి—విశ్వాస్

డాక్టరు—రైలు వెళ్ళిపోయిన తర్వాత స్టేషన్‌కి వచ్చావు !

మంజరి—ఉహు...దిగివస్తున్నాను.

బయట భజంత్రీలమేళం. ఆనందమోహన్ ఆదుర్దాతో ప్రవేశిస్తాడు.

ఆనందమోహన్—వింటున్నారా ఆ మేళగానం ?

డాక్టరు—ఏమిటది ?

ఆనందమోహన్—మాధవి కోసం మంగళధ్వానాలు చేసుకుంటూ వూరేగుతున్నాడు పెండ్లికుమారుడు.

మంజరి—(ముందుకివంగి) మాధవి ఎవరు ?

డాక్టరు—నీలాటిదే మరి ఒకతె.

మంజరి—నాలాటిదేనా ?

డాక్టరు—మూడు మూర్తులా.

ఆనందమోహన్—డాక్టరుగారూ, నాకు సెలవిస్తారా ? మిన్నువిరిగి మీదపడకపోతే రేపు కలుసుకుంటాను.

డాక్టరు—నిరాశపడకు, ఆనందమోహన్. మాధవి కూడా మంజరిలాగానే ఎప్పుడో నీ దగ్గిరికి వచ్చి వాలు తుంది. వాలినా, వాలకపోయినా—నీ జీవితంలో సంఘానికీ ప్రపంచానికీ ప్రసక్తి వుంది. అంచేత, నువ్వు బతుకుమీద రోత పుట్టించుకుని నిరుత్సాహపడకూడదు.

ఆనందమోహన్—క్షీరసాగరంలోని నురుగులమీదా, దేవకన్యల వకుళమాలలలోనూ, సుందర కుసుమ సౌరభాల మధ్యా తలపులు పెట్టుకున్న నాకు చింతా, వేదనా ఎక్కడి వండీ ! కాని, డాక్టరుగారూ, సత్యానికి వెరిచి ఆత్మని చంపు కోవడానికి నాబుద్ధి అంగీకరించదు. ఆత్మ సౌరభం నశించిన జీవితానికీ కాగితపు పువ్వుకీ తేడా ఏమిటి ? అయినా, మళ్ళీ ఎందు కీవాదన ! మంజరీదేవీ, సెలవు. (నమస్కారం చేస్తాడు—మంజరి అందుకుంటుంది.) డాక్టర్ గారూ, సెలవు సూర్యోదయమయేదాకా. (డాక్టర్ కి నమస్కారం చేస్తాడు—అతనూ అందుకుంటాడు.)

ఆనందమోహన్ వెళ్ళిపోతాడు.

మంజరి —పాపం! — చిన్నతనంలో ప్రణయానుభవ బాధ ప్రతినరాన్నీ కాల్చేసి అలా పీడిస్తుంది. ఆ వేదనా భారంలో నవనాడులూ కుంగిపోగా, దృష్టి వికటిస్తుంది; విలువలు మారిపోతాయి.

డాక్టరు—నువ్వూ మాట్లాడటం నేర్చుకున్నావే!

మంజరి—ఆడది ఎప్పుడోగాని తన హృదయ ద్వారాన్ని తెరిచి లోపలి మర్మాలు బయలుపుచ్చదు. పురుషుడు మాత్రం కనిపించిన ప్రతివాడితోనూ తనబాధ గ్రామఫోను ప్లేటులా చెప్పుకుంటాడు. ఆ చెప్పుకోవడంలో ఎన్ని ముత్యాలు బురదలో దొర్లే పందులముందు పోస్తాడో గుర్తించడు.

డాక్టరు—మంజరీ, జీవితంలో యితర ఆసక్తి ఏమీ కన్పించక యిక్కడికి వచ్చావ్—తెలుసునా! నేను కూడా చచ్చిపోయి వుంటే ఏం చేసివుందువు? (మంజరి కళ్ళూ చెవులూ మూసుకుంటుంది.) ఇన్నేళ్ళూ ధర్మమార్గంలో బతుకుతున్నాననే అహంకారం మినహా మరేమీ సంపాయించలేకపోయావ్! ఆ అహంకారం నిన్ను అబలగానూ అనాథగానూ చేసింది. నీ కోసం నువ్వు బతకక యితరుల కోసం బతికావు. మళ్ళీ మరొకరికి నీ జీవితాన్ని అంకితం యివ్వడానికి సిద్ధంగా వున్నావు.

మంజరి—కృతిపతికి గ్రహించాలని వుంటేనే!

డాక్టరు—మంజరీ, నీకు నేనూ, నాకు నువ్వూ బరువై పోతానేమో!

మంజరి—నాకు నువ్వు బరువవుతావని తోస్తే, వచ్చి వుండను. నీకు నేను అవుతానేమో, నాకు తెలీదు.

డాక్టరు—బరువే, కాని... ఛెట్ — ఇవా మనం మాట్లాడుకునే మాటలు! కాసేపు రేడియో విందాం.

రేడియోట్యూన్ చేస్తాడు డాక్టరు. అయిదు నిముషాల గానం. వెంకన్న చీటీ ఒకటి చేతిలో పుచ్చుకొని ప్రవేశిస్తాడు.

వెంకన్న—అబ్బాయిగారు ఈ చీటీ యివ్వమన్నారు.

డాక్టర్ రేడియో ఆపుతాడు. మంజరి చీటీ పుచ్చుకుంటుంది. చదువుతుంది.

"డాక్టరుగారూ, ఈ చీటీకి ఫ్రేముకట్టిస్తారో, బ్లాకు తీయిస్తారో ఇదే నా ఆఖరుసందేశం. మంజరీదేవి రామమ్మ పాటి చెయ్యదన్నారు. మీ అభిప్రాయం పొరబాటని చెప్తున్నందుకు నన్ను మన్నించండి. మంజరీదేవి విద్యుల్లత. మీ మందిరాన్ని పావనం చెయ్యడానికి విచ్చేసిన ఒక సుందర పికము. ఆ మృదుమధురమూర్తి. డాక్టరుగారూ, కోయిలని కూర వండుకు తింటామా? ప్రతిదీ ప్రయోజన దృష్టితో చూస్తే ఎలా? మంజరీదేవీ మీరూ కలుసుకున్న ఈ రోజు పర్వదినం. కాసేపు కాలపురుషుడు తన గమనాన్ని ఆపి,

మీవంక చూస్తే ఎంత శావుంటుంది! ఈ నిష్క్రమిస్తున్న స్నేహితుడికి చూపగలిగిన సానుభూతి మంజరీదేవీ మీరూ చెయ్యీ చెయ్యీ కలిపి చూపండి.

"ఇక నామాట—పసిడిబుగ్గల పసిపాప అమాయకపు నవ్వుకీ, జీర్ణకంకాళధారి అయిన బోసితాత వ్యర్థపు నవ్వుకీ వుండే వ్యత్యాసం నాకు భీతి కల్పిస్తూ ఈ యిహలోక వాంఛల పరమార్థం తెలుసుకోమని ప్రబోధిస్తుంది. బద్దీలు తప్పిన రైలుబండి తాలూకు పెట్టెలు పడిపోవడం తథ్యం. పవిత్రప్రణయాన్ని బలిపెట్టవలసి వచ్చిన జీవికి శాంతి లభ్యం కావడం దుర్ఘటంకాదు ... అసత్యం. అందుచేత, నాకు సూర్యోదయం లేదు. ఆకాశం భూమిని చుంబించే చోటుకి నా ప్రయాణం.

"నామీద వుండే ఆదరానురాగాలవల్ల మీరు నా బతుక్కి ఎక్కువ అర్థం కల్పిస్తారు. కాని, నా జీవిత సాఫల్యం మరణంలోనే వుందని నా విశ్వాసం. ఈ నిష్క్రమణ ద్వారా మెరిసే రూపాయిల మోతల మధ్యా, తెలీని సాంప్రదాయపు టుడుగునా యిరుక్కుని, శిల్పాకృతితో నిర్జీవంగావున్న మాధవి ఆత్మని మేల్కొల్పగలనని—నా బలీయమైన ఆఖరువాంఛ. వెచ్చనైన యువకరక్తంతో అభిషేకం చేస్తేనేగాని మాధవుల జ్ఞాననేత్రాల మైకం వదలదు. ఆత్మలేని మనిషీ, జాతీ, నాగరికతా నశించి తీరుతాయి. నిద్రపోయే ఒక ఆత్మని లేపడానికి నేను యిహలోక

యాత్ర చాలిస్తున్నాను. మీ కాంపవుండర్ని క్షమించండి-నేనే అతన్ని మోసగించాను.

"ఇద్దరూ వింటున్నారా?—మీ జగము బృందావనము—అంటున్నాడు ఆనందమోహన్.

మంజరి—ఎంతసాహసం! ఇంకా మాధవి కంఠంలో మంగళసూత్రం సరిగా పడకపూర్వమే!

డాక్టరు—ఆనంద మోహన్ అమృత హృదయుడు. క్షుద్రమానవ సముదాయంలో అమరత్వాన్ని చూడాలని కాంక్షించే అమాయకుడు. మాధవి మామూలుపిల్ల. ఆనంద మోహన్ రెక్కలుకట్టుకొని దేవతాలోకానికి ప్రయాణమై పోయాడు. (క్షణకాలం ఆగి) ఏ మహాయుగం రాబోతోందో, మంజరీ! ఏమిటీ అశాంతి మానవహృదయంలో? విలువలు మారిపోతున్నాయి-రంగులు తేలిపోతున్నాయి. ఆది శేషుడు భుజం మార్చుకుంటున్నాడా? ఒక వంక యుద్ధపిశాచి నృత్యం—మరోవంక గాఢజీమూతపటలి. దరిగానక ఎలుగెత్తి విలపించే అసహాయుల రోదన ఈ మహాప్రపంచపు సంగీతం. (కుర్చీలోనుంచి లేచి నుంచుంటాడు. మంజరి కూడా నుంచుంటుంది. ఆమె చెయ్యి తన చేతిలోకి తీసుకుంటాడు.) ప్రళయం రావాలి—మరో సృష్టి ప్రారంభం కావాలి. ఇది ఒకసర్పయాగం—ఒక దక్షయజ్ఞం. సర్వశక్తులూ ఈ హోమగుండానికి అర్పితం కావలసిందే! (బయట ఎ.ఆర్.పి.

సైరన్ కూస్తుంది. ఇద్దరూ మందస్మితవదనాలతో ఒకరి నొకరు చూసుకుంటారు.) వస్తున్నాడు శత్రువు. అవిగో శత్రువిమానాల మోతలు! 'నాది' అనేభావం బాంబర్ మినహా మరింకే శక్తీ పోగొట్టలేదు. పద—షెల్టర్ లోకి పోయి దాక్కుందామా ?—నడివీధిలో నుంచుని విధిని ధిక్కరిద్దామా ?

మంజరి—ఎక్కడికి కయినాసరే—పద.

ఇద్దరూ చెయ్యీ చెయ్యీ కలుపుకొని నడుస్తూ వెళ్ళిపోతారు.

(తెర)

# సు శీ ల

సుశీల పందొమ్మిదేళ్ళ పిల్ల. పాముపొబుసంలాంటి తెల్లనిచీర, కొత్తకత్తిరింపుల జాకెట్టూ ఆమె షోకిల్లా తనానికి నిదర్శనాలు. మెడలో సన్నటి బంగారు గొలుసూ చేతికివాచీ—అవే ఆమె ఆభరణాలు.

నైజువారీ పుస్తకాలు చిందరవందరగా పడివున్న పేపబల్ల అందుబాటులో వుండే సోఫామీద కూచున్న గ్రంథసాంగుడే మధు. ఎడంపాపిటా, పంజాబులాల్చీ, అత్తరుపువాసనా అతని ప్రత్యేకలక్షణాలు. వయసు ఎంతోకొంత—తలలో నెరసిన వెంట్రుక లేదు.

వేసవి సాయింత్రం అరుగంటలవేళ.

సుశీల—(చేతిలో పేపరుతో ప్రవేశిస్తూ) ఎట్ట కేలకు వోపెన్ చేశారు సెకండ్ ఫ్రంటు.

మధు చిన్నగా నవ్వగా, సుశీల కాస్త తమాయించుకుని, అతని కెదురుగావున్న కుర్చీలో చతికిలబడుతుంది.

సుశీల—ఏం—నీకు సెకండ్ ఫ్రంటు పరియాచకంగా వుంటోందా !

మధు—ఏరేతమాట !... అయినా మన కెందుకు పోనిద్దూ యుద్ధాలగొడవ ? 'పానశాల' చూశావుగా ?

సుశీల—ప్రపంచ భవిష్యత్తంతా ఈ యుద్ధంతో వుంది. నాగరికత అనేది నిలబడాలీ అంటే మిత్రమండలి నెగ్గాలి.

మధు—అలాగే—అలాగే !

సుశీల—మనమ్మ యుద్ధాన్నంత సీరియస్‌గా తీసుకోవేం ?

మధు—ఎవరు చెప్పారామాట ? తీసుకోకేం—చాలా ఘాటుగా తీసుకుంటున్నా. ఎటొచ్చీ ఈ యుద్ధంతో మన

దేశానికా ప్రసక్తి లేదు; వ్యక్తిగతంగా ఆలోచిద్దామా అంటే తత్వానికా ఫిరాయించదు.

సుశీల—చరిత్ర పరుగులో యుద్ధాలు దీపస్తంభాలు.

మధు—కాని, అవి గుడ్డిదీపాలు. బాట పేట్లోకి దారి తీస్తుంది.

సుశీల—మనిద్దరి మధ్యా ఈ పరస్పర విభిన్నత ఎందుకు వుండాలీ ?

మధు—సోది అడుగు.

సుశీల—అబ్బ ! నీకు నేనంటే ఎంత తృణీకారం !

మధు—ఎవరు చెప్పారు ఆ విషయం ?

సుశీల—నేనే గ్రహించాను.

మధు—ఓహో !......బీదికి పోదాంలే.

సుశీల—ఊహు...... ఇప్పుడు జయరావు వస్తాడు ఇక్కడ కలుసుకుందామని చెప్పాను. మా యిద్దరి తగవూ నువ్వు తీర్చాలి.

మధు—నా నెత్తిని ఎందుకూ ఆ అక్షింతలు—మునసబీ వెలిగించి, 'బార్' ని వూపేసిన మీ బాబువుండగా ?

సుశీల—కాదు, మధూ !

మధు—ఏమిటె, సుశీ !

సుశీల—నీ నిర్లక్ష్యం చూసినకొద్దీ నీ మీద నాకు మమకారం ఎక్కువవుతోంది.

మధు—బహుశా- అనుకోకుండా చెప్పిననిజాలలో యిది ఒకటి......ఇంతకీ జయరావు ఎందుకు వస్తాడు ?

సుశీల—నువ్వు చూశావుగా ఆయన్ని?

మధు—చూశాను-నెల్లాళ్ళ క్రితం సినిమాకి వెంటబెట్టుకు వచ్చావుగా!

సుశీల—ఆయన నన్ను ప్రేమిస్తున్నాట్ట.

మధు—పాతపాటే — రోకంటిపాట.....మిగతా కథ తెరమీద చూపబడును.....అంతేనా?

సుశీల—నీకంతా వేళాకోళం.

మధు—కాదు, సుశీ, నువ్వతన్ని ప్రేమించడం లేదు. ఏమంటావ్?

సుశీల—ఊఁ.

మధు—అతనికి చెప్పెయ్యి ఆ విషయం.

సుశీల—ఆయన గుండె పగిలి చస్తే.....

మధు—అంత పీకెలమీదికి తెచ్చుకుంటారా?

సుశీల—నేను జాగ్రత్తగావుంటూనే వలలో యిరుక్కుపోయాను.

మధు—మొట్టమొదట అతని కళ్ళ ఆకలి ఈ సౌందర్యరాశిమీద కుమ్మరించాడు—జాలిగా మందహాసం చేశావ్! ఆ తర్వాత అతను కలానికి పని చెప్పడం ప్రారంభించాడు—'కర్టెసీ' కంటూ సమాధానాలు రాశావ్! పార్టీలకీ పిక్చర్లకీ పిలిచాడు—పోనీలే అనుకుంటూ పక్కని నడిచావ్! అతను నిన్ను చనువుతో స్పృశించాడు—వూరుకున్నావ్!.....

సుశీల కళ్ళు చెమ్మగిల్లాయి. మనిషి బిత్తరపోతుంది.

సుశీల—నువ్వు నా బాధలు అర్థంచేసుకోగలవని నీదగ్గిరికి వస్తే—నువ్వుకూడా అందరిలాగానే—తుపాకి బారు చేసి తూటాలు ఒక్కొక్కటే నామీదికి వదుల్తావా? నువ్వూ జనాభాసంఖ్యలో జేరిపోతున్నావా? మాకదగ్గిరికి వచ్చి, నువ్వూ మందతో కలిసి చప్పట్లు కొడతావా? అయితే-.....పోతాను.

సుశీల పర్సులోనుంచి తీస్తుంది. మధు అమాంతం ముందుకిదూకి, ఆమె చెయ్యిపట్టుకు వారిస్తూ, సోఫాలో తనపక్కని కూచోపెట్టుకుంటాడు.

మధు—మధు అలా జారిపోడు. తప్పటడుగులు పడనివ్వడు...నీకేం కావాలో చెప్పు?

సుశీల—నాకు నిజంగా ఏం కావాలో నే నెన్నటికీ తెలుసుకోలేనేమో!

మధు—ప్రస్తుతం?

సుశీల—జయరావు నుంచి విముక్తి.

మధు—ఏమంటాడతను?

సుశీల—తన్ను పెళ్ళిచేసుకోమంటాడు.

జయరావు ప్రవేశం. సూట్‌వాలా. వయసు పాతికలోపు. ఇద్దర్నీ సోఫాలో చూడగానే ప్రథమంలో కాస్త ఇబ్బందిపడ్డా, తర్వాత సర్దుకుని, ఖాళీకుర్చీ ఆక్రమిస్తాడు. సుశీల—ఇప్పుడే వస్తానంటూ—లోపలికి తప్పుకుంటుంది. బరువంతా మధు నెత్తిని. రెండునిమిషాల అనంతరం నిశ్శబ్దం ఫెడీలున పేలుతుంది.

మధు—సుశీల చెప్పింది-మీకామెని తమదిగా చేసుకోవాలనివుందని. కాని, మీరు నిప్పుతో చెలగాట మాడుతున్నారేమోనని నా అనుమానం.

జయరావు—అదేమిటలా అంటారు ?

మధు—చంద్రుడిని దొడ్లో గుంజకి కట్టేద్దామను కోవడం, నక్షత్రాల్ని పడకగదిలో వెలిగించుకుందా మను కోవడం, నీళ్ళని గుప్పెట్లో యిముడ్చుకుందా మనుకోవడం—ఇవి ఎంత అపభ్రంసపుటాలోచనలో, అలాంటిదే సుశీలను పరిణయమాడటం.

జయరావు—మీ రామెని నాముందు 'యిన్సల్ట్' చెయ్యకండి.

మధు—చెయ్యవలసిన గతి పడుతుందని అనుకోలేదు—కాని, ఆ భారం నా భుజాలమీద పడింది. అంచేత, మోస్తున్నా. జయరావుగారూ, మీరు పసివారు. స్త్రీ హృదయం లోతు గ్రహించలేక, ఈత నేర్చుకునే కొలనుగా భ్రమిస్తున్నారు దాన్ని. అదో అఖాతం. సుశీల ఆడది. తన చుట్టూ చేరే మొగాళ్ళని ఆడించడమే ఆమె పని. అది ఆవిడ వినోదం. ఆ మాత్రపు ప్రణయతాపానికే భగ్గున మండే కీటకాలని ఎవడు రక్షించగలడు ?

సుశీల పొంచి మంచుని వింటూ వుంటుంది.

జయరావు—మీరే సుశీలని ప్రేమిస్తూ—నాకు కానివ్వకుండా చేసేందుకు—యిలాటి పచ్చి అబద్ధాలు ఆడుతున్నారు.

మధు—(వికటంగా) సుశీలని నేను ప్రేమించడమా ? ప్రేమ. అలాటి పదం నా నిఘంటువులో లేదు. ముక్కా,

మొహం, బావున్న ఏగో ఒక అమ్మాయికి హృదయాన్ని తాకట్టుపెట్టి, జన్మ అంతా ఆ ఋణబాధతో కుమిలి కృశించి పోను. సుశీల కాదు—ఏ స్త్రీ కూడా నా గుండెని యినప్పెట్లో పెట్టి, వాడని వెండి సరుకులతో బాటు పదిలపరుచుకోలేదు. 'అనితరసాధ్యం నా మార్గం.' నేను ఆర్టిస్టుని. ఈ ప్రపంచమంతా నా క్రీడారంగం. ఈ యిసకలో గుజ్జనగూళ్లు వండాను—అలిసిన ప్రియురాలి కనుమూతల అందాన్ని చూశాను—దప్పిక తీర్చుకునేందుకు ఖర్జూరపు పళ్లుతింటూ ద్వంద్వాలని దాటుకు వస్తున్నాను. ఈ జగమంతా నా ఆనందానుభూతులకోసం నిర్మాణమై వుంది. తెలిసిందా, జయరావుగారూ, అలాటి 'అరిస్టో క్రాట్' సుశీల వాకిట ముందు 'భిక్షాం దేహీ' అంటాడా ?.........

సుశీల ఛెంగున ముందుకి దూకి మధు చెయ్యి పట్టుకు, కళ్ళల్లోకి చూస్తూ....

సుశీల—మాట్లాడు, మధు, మాట్లాడు. నువ్వలాగే అదే దర్జాలో మాట్లాడుతూవుంటే, నా బతుకంతా నీపాదాల మీద పారేసి వినాలని వుంటుంది. ఈ జగత్తు నంతా పాలించే యోధుడిలా, సమస్తమూ శాసించే శూరుడిలా, కళలన్నీ నీలో అంతం కావల్సిన పిపాసిలా మాట్లాడు...... మాట్లాడు.........

మధు—నీకు మాటలంటే గాలిమూటలు. అంచేత వుపన్యాస ధోరణిలో వాగమంటావ్. నేను యోధుణ్ణీ కాను, శూరుణ్ణీ కాను, పిపాసినీ కాను. ఆర్టిస్టుని. సత్యానికి

వెరవనివాణ్ణి. నిశితదృష్టితో లోకవ్యవహారాన్ని పరిశీలించే ద్రష్టని.

జయరావు—నాకీ గందరగోళం అగమ్య గోచరంగా వుంది. కాని, ఈ కారుచీకటిలో ఒక్కటే నిజం వజ్రంలా ప్రకాశిస్తోంది. సుశీల వలపు అబద్ధం. స్త్రీజాతి అభ్యర్థి సుశీల. కానుకగా సమర్పించిన గుండెమీద గొడ్డలివేటు పెట్టావు, సుశీలా......ఈ సాయంత్రమే అర్. ఎ. యఫ్. లో చేరిపోతాను.

మధు—మిత్రమండలి అంతిమవిజయానికి ఉడుతాభక్తిని సాయం చేస్తారా ?...కానివ్వండి. విశాలమైన జీవితం అనుభవంకాగానే సుశీలల విలువ మీకే తెలుస్తుంది.

తన వునికి అనవసరమన్నట్లుగా భావిస్తూ జయరావు తప్పుకుంటాడు.

మధు—దొంగనాణాలతో జీవితనౌక దాటబోతే అది నట్టేట్లో మునుగుతుంది. ఈ చెలగాటానికి అంత మొక్కడ ?

సుశీల—నీ సాన్నిధ్యంలో.

( తెర )

# వీణ

శ్రీనివాసమూర్తి, వెంకపంతులూ వీణ గార్డియనులు. ఇద్దరూ వేషభాషల్లో ఆమడదూరం. మూర్తి నెరిసిన క్రాపుకి పంతులు పిలక సమాధానం. నలభైలలో యిద్దరి వయసూ. కుర్చీలూ, సోఫాలూ ఉన్న గదిలో మూర్తి పేపరు తిరగేస్తూ వుండగా పంతులు ప్రవేశం. ఉదయం తొమ్మిదిగంటల వేళ.

మూర్తి—దయచెయ్యండి ... దయచెయ్యండి. (కుర్చీ చూపిస్తాడు. అలిసి వచ్చినవాడిలా చతికిల బడతాడు పంతులు.)

పంతులు—జనాబ్ జిన్నాతో గాంధీజీ మంత్రాంగం మంట గలిసిందా! నాకు తెలుసండీ—ఎంత గుంజటానికి వీలుంటే అంత లాగాలని చూస్తున్నారు ముస్లిములు. ముసిలి వాడికి...

హిందూదేశ స్వాతంత్ర్యానికి ప్రతిబంధకంలా పొడగడ్తున్న గడ్డు సమస్యని అంత సూక్ష్మంలో తేల్చేయ్యగల సమర్థత తనకి లేదన్నట్లుగా మూర్తి నవ్వు తెప్పించుకుంటాడు.

పంతులు—నవ్వుతారేం ?—చెప్పండి.

మూర్తి—చెప్పేందు కేముంది ? రాజకీయాలు. వాటికి మతకక్షలతో ముడి...మతాలన్నీ మంట గలిసిననాడు గాని లోకానికి శాంతీ, మానవుడికి స్వేచ్ఛా లభించవు.

పంతులు—మీ రెంతకీ ఆ తెల్లవాళ్ళ సిద్ధాంతాలు పట్టుకు దేవుళ్ళాడుతారు గాని మన వేదాలూ వుపనిష త్తులూ...

మూర్తి—ఎందుకు పంతులుగారూ మన కీమొండి వాదన ? దృక్పథంలో తేడా వున్నప్పుడు ఎంత తర్కించినా పరిష్కారం ఎలా ?

పంతులు—అలా అన్నారు - బావుంది. ఇంతకీ నేను వచ్చిన విషయ మేమిటంటే...

మూర్తి—చెప్పండి. సంశయిస్తారేం ?

పంతులు—అయ్యయ్యో ! సంశయం ఎందుకు ? వీణ యిక మన అదుపాజ్ఞలలో వుండేటట్లు లేదు. ఆమెకి ఎంత తొందరగా పెళ్ళిచేసేసి మనబరువు దించేసుకుంటే అంత మంచిది. చూస్తూ చూస్తూ వుండగా మనని గోతులో దించేటట్టు వుంది.

మూర్తి—పట్టున పద్దెనిమిదేళ్ళు లేవు - ఆవిడ మనని గోతులో దించటమేమిటి ?—చిత్రంగా మాట్లాడుతున్నారు !

పంతులు—గొయ్యి అంటే - గొయ్యి తీసి మనల్ని అందులో పాతిపెట్టడమనా ?

మూర్తి—ఉహు-వొట్టి గొయ్యే ! పోనీ, వూబి అనండి.

పంతులు—నేను ఎప్పుడు వీణవిషయం మాట్లాడినా మీరలా వేళాకోళం చేస్తారు.

మూర్తి—సంగతేదో తేల్చరేం !

పంతులు—విశ్వనాథరావు పోతూ పోతూ నాలుగేళ్ళ పసికూననీ లక్షరూపాయిల ఆస్తినీ మనిద్దరి చేతిలో పెట్టాడా? ఏదో యింతవరకూ సాదుకొచ్చాం...ఇక సమర్థించడం నా

వశం కాదు. ఏదో యింకో రెండేళ్లు కళ్లుమూసుకుంటే ఆ బి. ఏ. కాస్తా అయిపోతుంది-సలక్షణమైన సంబంధం వెతికి అమ్మాయిని ఒక అయ్యచేతిలో పెడితే...

మూర్తి—బాగానేవుంది. ఇప్పుడు విరుచుకు పడ్డ వుపద్రవం ?

పంతులు—ఇంకా నెమ్మదిగా అంటారా! వీణ యిప్పుడు వస్తుంది—ఆవిణ్నే అడగండి.

మూర్తి—ఎన్నేళ్లు గడిచినా మీ కథాశిల్పం యింతే గదా! ఆ ముంచుకొచ్చిన ప్రమాద మేమిటో నా చెవిని వెయ్యకూడదూ ?

పంతులు—చెప్తే...వోస్ యింతేనా—వొట్టి బూటకం అంటారు. మీ తీరే అంత !

మూర్తి—మీరు చెప్పినా ఒకటే చెప్పకపోయినా ఒకటే గాని...ఆ టెక్నిక్ మాత్రం చాలా యిబ్బందిగా వుంటుంది. పోన్లెండి, వీణే చెప్తుంది ! ఇంతా చేస్తే-మొన్న హాస్టల్ సూపరెంటు పర్మిషన్ లేకుండా సినిమాకి వెళ్ళిందనో, నిన్న కాలేజీలో లెక్చరర్ని వెక్కిరించిందనో, యివేళ తన గదిలో కుర్చీ కాళ్లు పీకేసిందనో...ఇవేగా ! ఇంతేగా ! వీణే చెప్తుంది లెండి.

పంతులు ద్వారంగా చూస్తూవుండగా వీణప్రవేశం, లేత గులాబి రేకా, చంద్రుడి తొలికిరణమూ మేళవింపగా ఐన రూపం వీణది. వేషమా ? ఖద్దరు చీరె మాత్రం కట్టుకోదు. మిగతా తళుకు బెళుకులు ఎలావున్నా లోపం రాదు.

వీణ—(శ్రీనివాసమూర్తిని వుద్దేశిస్తూ) ఎందుకు కబురంపించావు బాబాయీ?

మూర్తి పంతులు కళ్లల్లోకి అర్థంతో చూస్తాడు. కట్టించుకున్న పన్ను జారకుండా చిరునవ్వుతో పంతులు తన మొహాన్ని చీకాకుపరుచుకుంటాడు.

మూర్తి—ఏం లేదమ్మా!—పదిరోజు లయింది కదా అని, ఒకసారి చూదామని......

వీణ మూర్తి సోఫాలో అతనిపక్కన కూచుంటుంది.

వీణ—బాబాయీ, నాకు సెలవుల్లో ఏవైనా దూరపు కొండల్లోకి పోవాలని వుంది. పంపిస్తావుగదూ?

మూర్తి—అలాగేనమ్మా! మీ ప్రొఫెసరు పంకజం బాగా చెప్తోందా?

వీణ—నాతో మాట్లాట్టం మానేసింది. నన్నేం ఉద్ధరిస్తుందా? నాకేం? ఆవేళ ఏడిపించానని ఉక్రోషం. ఆ మాత్రం వేళాకోళం సహించలేని మనుషులు బతకడ మెందుకు?

పంతులు—ఎందుకా?...'నేను చెవులట్టుకు ఆడిస్తాను-నువ్వు పడివుండు' అంటే ఆ పంకజంగారి కేం పట్టింది! మా మొహాల రాసివుంది కనక మేం అనుభవిస్తాం—ఆవిడ కేం! పంకజంగారంది: 'పంతులుగారూ, మీ మొహం చూసి వూరుకుంటున్నాను. లేకపోతే, ఆ పిల్ల నీపాటికి సస్పెండ్ చేయించి వుందును......'

వీణ—ఈవిడే-మహా పెత్తనదారు! ఐనా మామయ్యా, నీకు నామీద అంత కోపం ఎందుకు?

పంతులు— నీ పోకిళ్ళు బావుండటం లేదమ్మాయ్! మూర్తిగారికేం చిదానందుడిలా నవ్వుతూ కూచుంటాడు. మధ్యని నా కొచ్చిం దీఅవస్త.

వీణ—ఏమి అవస్త మామయ్యా?

పంతులు—నిన్ను కాపాడటం; నీకు సంరక్షకుడిగా వుండటం.

వీణ—దొంగ లెత్తుకు పోతారా నన్ను కాపాడ టానికి! సంరక్షించేందుకు - నన్ను నేను రక్షించుకోలేనూ!

పంతులు—ఊ...ఇంతేలే. చివరికి పంగనామాలే!

మూర్తి—పంతులుగారూ, చిపిన్నల్లతో వాద ప్రతి వాదా లేమిటండీ! పైన మనం లేమూ సమస్తమూ విచారించేందుకు!

పంతులు—విచారమే చిట్టచివరికి మిగిలేది.

వీణ—ఎవరికి?

పంతులు—నాకు. నా ఖర్మం కాలి నాకు. నా ప్రతిష్ట నష్టేట్లో మునగడానికే ఈ బెడద వచ్చింది. విశ్వనాథరావు ఎంత మంచివాడు—గంగిగోవులాటి సాధువు. ఒకర్ని నొప్పించి ఎరుగునా? అతని సంఘసంస్కా.ర మేమిటో, అతని విధవా వివాహా లేమిటో-అంతేగాని- మరో ప్రపంచం ఎరుగునా? మీ నాన్నమీద వుండే అభిమానం వల్ల నిన్ను సహిస్తున్నాను గాని......

వీణ—మా అమ్మ అంటే ఎంతో యిష్టమని వో సారి నాతో అన్నావుగా!

పంతులు—అవును. ఆవిడ ఎటువంటిది ? ఈకాలపు ఆడ వాళ్ళకి బుద్ధిచెప్పేరకం. ఎలాటి యిల్లాలు ! ఎంత పతి వ్రతామతల్లి ! భర్తా, సంసారం, పాడీపంటా, సేవా పరా యణత్వం, అతిథులూ, అభ్యాగతులూ......

వీణ—విధవా వివాహాలు చేయిస్తున్నారని అమ్మనీ నాన్ననీ వెలేశారు అన్నావుగా ! అలాంటప్పుడు మా యిం టికి అతిథులూ, అభ్యాగతులూ ఎలా వచ్చేవారు ?

పంతులు—మూఢ సాంప్రదాయంలో బతుకుతూ వేద యుగపు దృష్టీ పురాణకాలపు నీతీ తెలీనివారు వెలి వేశారు. అటు ఆర్యమత సిద్ధాంతాల్నీ, యిటు లోక వ్యవహారాన్నీ అవగాహన చేసుకున్న మాలాటివాళ్ళం లేమూ ?

వీణ—(కొంచెం హేళనగా) ఆ ! వున్నారు, వున్నారు. ఇంతకీ నువ్వు మా అమ్మమీద యిష్టం వల్లనా, మా నాన్న మీద అభిమానం వల్లనా నాకు గార్డియన్‌గా వుండటానికి వొప్పుకున్నది ?

మూర్తి—అలాటి కొంటె ప్రశ్నలు వెయ్యకూడదు అమ్మాయీ.

వీణ—కాదు, బాబాయీ, వెనక వో సారి—అమ్మని చూస్తే తనకి అపరిమితానందంగా వుండేదనీ, అమ్మ చచ్చి పోతూ నా విషయమై తన చేతిలో చెయ్యి వేయించుకుందనీ, నాన్న నన్ను నీకు ఒక్కడికే వప్పజెప్పాదా మనుకుంటూ

వుంటే, తను ఎంతో ప్రయాసపడి నాన్నని వొప్పించి తనను కూడా గార్డియన్‌గా చేయించుకున్నానని, దీనంతకీ అమ్మ మీద వుండే యిష్టమే కారణమనీ......

పంతులు విస్మయం పెడతాడు.

మూర్తి—అవన్నీ, పాతకథలు, వీణా, నీకెందుకు? పంతులుగారూ, అసలు విషయం తేల్చండి. ఈ వుపోద్ఘాతం చాలదూ?

పంతులు—నాకు నోరు రావడంలేదు చెప్పేందుకు.

వీణ—ఏమిటి, బాబాయీ?

మూర్తి—నిన్ను గురించే!

వీణ—(కొద్దిగా బెదురుతూ) బాబాయీ నీతో చెప్ప వలసిన ఒక పెద్ద విషయం వుంది. మామయ్య వినకూడదు.

పంతులు—అవును. ఆయన మంచివాడే! నేను బడ బడ వాగుతాను కనక దుర్మార్గుణ్ణి. స్వర్గంలో వున్న నీ తల్లి ఆత్మకి తెలుస్తుంది నా ఆవేదన. నీకు ఒక పొదుపైన జీవితం లభించాలని ఎంత తాపత్రయ పడుతున్నానో......

వీణ—(అమాంతం పంతులు సోఫాలోకి వురికి) నువ్వు సావధానంగా ఆలోచించవు. నీతిమీద రెండు వుపన్యాసాలు దంచి నన్ను నాలుగు తిడతావు.

పంతులు—నాకు తెలుసు కొంప మునిగిందని.

మూర్తి—మీ కన్నీ తెలుసు.

పంతులు—ఆ పరాత్పరుడే మననీ అప్రతిష్టనుంచి కాపాడాలి...వీణా, నేను సూటిగా అడుగుతున్నాను చెప్పు.

ప్రసాదరావూ నువ్వూ...లోకమంతా కోడై కూస్తోంది. అంతటితో ఆగిందా......నీకు నాలుగో నెల అని చెవులు కొరుక్కుంటున్నారు......

వీణ రెండు సోఫాలకీ మధ్యనివున్న కుర్చీలోకి వెళ్తుంది. దీనంగా కూచుంటుంది. పోర్షన్ వప్పజెప్పేసిన యాక్టర్ పోజులో వుంటాడు పంతులు.

మూర్తి—వీణా, అంత అజ్ఞానంలోకి దూకావా ?

పంతులు—ఇదే కనక నిజమయితే, నేను తలెత్తుకు ఎలా తిరిగేది ?

మూర్తి—నీకు విద్యాభ్యాసం మీదా, జ్ఞానోపార్జన మీదా ఆసక్తి అనుకున్నాను. నువ్వుకూడా ఈ సాధారణ వాంఛలకీ ప్రలోభాలకీ బందీవి అవుతావని ఒక్కనాడూ భ్రమించలేకపోయాను. నీ అల్లరి బాల్యచాపల్యం అనీ, నీ ఆటలు స్వభావంలోని వజ్రపుతునకలనీ, ప్రాక్పశ్చిమ సమ్మేళనంతో నీ బతుకుబాట ఏర్పాటు చేసుకుంటావనీ...

పంతులు—ఈ మూడేళ్ళనుంచీ మీరే మోతాదు మించిన స్వాతంత్ర్యం ఆమెకి యిచ్చి, ఈ స్థితికి తీసుకు వచ్చారు. స్వాతంత్ర్య మనే వస్తువుని కొన్ని నియమాలతో పొదుపు చేసుకోవాలి. నీతీ జాతీలేని స్వేచ్ఛ కావాలంటే అడవుల్లోకి పోతేసరి !...ఇంతకీ లోకం అనుకునే మాటలు నిజమేనా, అమ్మాయీ ?

వీణ—లోకానికి నా నడవడిక పరిశీలించడం కంటె అవసరమైన పనులు వున్నాయి. లోకమంటే మీ రెండో

అమ్మాయి వసు ధర ఒకర్తే. ఆవిడే పదిలంగా నీ చెవిలో వూది వుంటుంది.

పంతులు—ఎలా పొక్కుతేనేం బయటికి- మనకి కావలసింది నిజానిజాలు.

మూర్తి లేచిసుంచుని ఒక్కసారి పచారుచేసి యథాస్థానంలో కూచుంటాడు.

మూర్తి—అసలు సంగతేమిటి ?

వీణ—వసుంధర ప్రియులసంఖ్య మామయ్యకి అక్కర్లేదుగాని, ప్రసాదరావుగురించి నన్ను గదామా యిస్తున్నాడు. వసుంధర యింత వుడుకుబోతుపిల్ల అనుకోలేదు ... బాబాయీ, మామయ్య చెప్పిందంతా నిజమే. నాకు నాలుగోనెల నేను ప్రసాదరావుని మాత్రం పెళ్ళిచేసుకోను. మీరింక బుర్రలు బాదుకోండి.

వీణ లేస్తుంది. పంతులు అధికారంతో "ఎక్కడికి పోతావ్ ?" అంటూ అడ్డు నిలుస్తాడు.

వీణ—నన్ను అటకాయించి ఏం చేస్తావ్ ? (నవ్వుతూ) 'శాంతారాం శకుంతల' చూడలేదూ నువ్వు ?

మూర్తి—దుష్యంతుడూ శకుంతలా శాస్త్రీయంగా పరిణయ మాడారు.

వీణ—అప్పైన ఆజన్మాంతమూ ప్రేమించుకున్నారు ! నా వ్యక్తిత్వాన్ని గౌరవించని వివాహ సాంప్రదాయంమీద నాకు విశ్వాసంలేదు.

పంతులు—సరిగ్గా కళ్ళు తెరిచావో లేదో, అప్పుడే నీ విశ్వాసాలూ, నీ అభిప్రాయాలూ, నీ సిద్ధాంతాలూ !

మూర్తిగారూ, ఆ ప్రసాదరావుని ఈవిడ పెళ్ళి చేసుకు తీరాలి.

వీణ—మీా రెవరు అలా శాసించేందుకు ?

పంతులు—గార్డియన్ని.

వీణ—ఆ స్త్రికి—ఆత్మకి కాదు

పంతులు—ఎందుకా పెద్దకబుర్లు ! కాఫీ అరగంట ఆలస్యం అయిందని వంటమనిషిని చెడామడా తిట్టిన దానివి!

మూర్తి—నీ ఆత్మ ఈ పతనం పొరబాటని చెప్పడం లేదూ ?

వీణ—బాబాయీ, విలాసంగానూ నిర్లక్ష్యంగానూ నడిచి పోతూవుంటే అక్కడ పాడుపడ్డ నుయ్యి వుందని మీారు నాకు చెప్పలేదు. తీరాపడ్డతర్వాత, నుయ్యి చుట్టూచేరి చప్పట్లు కొడుతున్నారు. లేచి బయటికి వస్తానంటే, 'రావద్దు—ఆ కంపులోనే కైలాసం నిర్మించుకో !' అంటున్నారు. రాళ్లు రువ్వినాసరే, బయటికి వచ్చి, నా దారిని నేను పోతాను.

పంతులు—ఒకరు చెప్పేదేమిటి—నువ్వు తీసుకున్న గోతిలో నువ్వు పడ్డావ్ ?

మూర్తి—ఆ ప్రసాదరావెవరండీ, పంతులుగారూ !

పంతులు—రిటైర్డు డిప్టీకలెక్టర్ వీరయ్య చౌదరి రెండో కొడుకు. మొన్ననే బి. ఏ. పాసయ్యాడు. ఏదైనా స్కాలర్ షిప్ సంపాయించి పెద్ద చదువుకి పంపిద్దామని చూస్తున్నాడు చౌదరి.

మూర్తి—ఓ! వీరయ్య చౌదరి కొడుకా! అతను బ్రాహ్మలమ్మాయి అంటే ఎగిరి గంతేస్తాడు...వీణా, సాంఘిక జీవనం ఆశించినప్పుడు, నీ స్వంత అభిప్రాయాలు కొన్ని మార్చుకోవలసి వుంటుంది. ఇష్టాయిష్టాల ప్రసక్తి లేకుండా కొన్ని నిబంధనలకి లోబడవలసి వుంటుంది. ఎదురీదబోకు. బాబాయి మాట విని, ప్రసాదరావుని పెళ్ళిచేసుకో.

వీణ—ప్రసాదరావు మీద వ్యామోహం వున్నన్నాళ్ళూ అతనిలోపాలు నాకు తెలీలేదు. ఆ మమకారం తీరిపోగానే మసక విడిపోయినట్లు అతని నిజస్వభావం నాకు గోచరమయింది. బాబాయీ, పెళ్ళి అయేదాకానే ఈ కొత్త కాలపు మొగవాళ్లు స్త్రీ స్వాతంత్ర్యమనీ, హక్కులనీ వెర్రిగా మొరుగుతారు. వందరూపాయిల నౌకరీవచ్చిందంటే చంకలు గుద్దుకుంటూ తమ బానిసత్వాన్ని మరిచే జనులు మాకు స్వాతంత్ర్యం యిచ్చే దేమిటి? ప్రసాదరావేమిటో మనిషనుకుని స్నేహం చేశాను. ఆ స్నేహంలో తన్మయత్వం పొందిన కొన్ని ఘడియలలో నన్ను నేను మరిచిపోయాను. ఆరునెలల అనంతరం ప్రసాదరావులోని మానవత్వం వొట్టిపై మెరుగని స్ఫుటంగా కనిపించింది.

పంతులు—పోనీ, మరొకణ్ణి ఎవణ్ణయినా చూసి, ఏదో మసిపూసి మారేడుకాయ......

వీణ—ఛెట్...నాకు పెళ్ళివద్దు.

మూర్తి—పెళ్ళి అనేది వ్యక్తికోసంకాదు, సంతానం కోసం. పుట్టబోయే పిల్లగతి ఏంగాను? నాన్న ఏడంటే ఏం చెప్తావ్ ?

వీణ—'నీకు నాన్న లేడు' అంటాను.

పంతులు—నువ్వు స్త్రీవి కావు—రాక్షసివి. ఆ మహా యిల్లాలు కడుపున......

మూర్తి—వూరుకోండి పంతులుగారూ !

పంతులు—వూరుకోక ఏం చేస్తాను—వురెట్టు కుంటానా ? మా శరణాలయంలో పిల్లలు యింక నన్ను బతకనిస్తారా ? (రెండు చేతులూ నోటిమీద వేసుకుంటాడు.)

మూర్తి—ఇంతకీ పర్యవసానం ఏమిటి, వీణా ?

వీణ—నేను పెళ్ళి చేసుకోను.

మూర్తి—పోనీ, డాక్టర్ సుదర్శనం దగ్గిరికి వెళ్దామా ?

వీణ—ఛా. నా కలాటిపని యిష్టం లేదు.

మూర్తి—నువ్వు లానీ, శాస్త్రాన్నీ, సమాజాన్నీ ధిక్కరిస్తున్నావ్ ! నీది సామాన్య లక్షణం కాదు. అసాధారణ మనఃప్రవృత్తి. ప్రజలు నిన్ను కాకుల్లా పొడవటం, నీకు పుట్టే పసి కూన, 'నా' అనేవారు లేక నువ్వు మాలిన్యంలో పొర్లాడటం...

వీణ—బాబాయీ, నువ్వు సత్యాగ్రహంలో జైలుకి వెళ్ళేటప్పుడు లాఠీదెబ్బలకి జంకావా ?

మూర్తి—అది దేశసేవ.

వీణ—నీది ఒక్క దేశానికే సేవ. ఇది స్త్రీ ప్రపంచపు దీనాలాపం.

మూర్తి—కాని, స్త్రీలే నీ ఆదర్శానికి నిన్ను దూషిస్తారు.

వీణ—అంత చక్కటి గుడ్లగూబ లని తయారు చెయ్యగలిగిన పురుష వరేణ్యుల్ని అభినందించాలి. సంసారంలో సామరస్యం కావాలంటూ మొగవాడు ఆడదాన్ని పిల్లల్ని పెట్టే యంత్రంగా చేస్తున్నాడు; తనలో అయిక్య మవాలంటూ బానిసగా చేస్తున్నాడు; గృహలక్ష్మి అంటూ కూరలు కొనేందుకు డబ్బు లిస్తున్నాడు.

పంతులు—భార్యాభర్తలమధ్య క్షీరోదకన్యాయం లేకపోతే సృష్టి ఎప్పుడో సమసిపోయేది.

వీణ—పాలు విరిగాయి, మామయ్యా!

పంతులు—కాదు, నీ బుద్ధి.

వీణ యిద్దరికీ కొద్దిదూరంలో నుంచుంటుంది.

మూర్తి—వీణా, చిన్నతనపు పట్టుదలతో చదువూ, సంఘమూ, మర్యాదా పరిత్యజిస్తున్నావ్! ఈనాటి నీ తిరుగుబాటుకి లా కత్తి నూరుతుంది. శాస్త్రం పళ్ళు బిగిస్తుంది. సమాజం కోరలుసాచుకు నిన్ను మింగే అదనుకోసం కాచుకు కూచుంటుంది. నువ్వు బయటికి పోకు. నా యింట్లో వుండిపో.

వీణ—డాక్టర్ సుదర్శనం దగ్గిరికి మాత్రం రాను.

మూర్తి—ఆ మొండితనమే పనికిరాదంటున్నాను నేను! స్తిమితంగా ఆలోచించిన మీదట నువ్వే వొప్పుకుంటావ్!

వీణ—ఏమిటా నమ్మకం? నేను వొప్పుకోను.

పంతులు—అవి జెందుకు వొప్పుకుంటుందండీ — మన ప్రాణాలు తియ్యడానికి అవతార మెత్తిన కాళికామ్మవారు!

వీణ—మీరు పురుషులు మీ పూర్వులూ, ఆ గడ్డాల ఋషులూ ఏర్పాటు చేయించిన నియమాలు మంటగలుస్తాయేమోనని మీ రక్తానికి భయం. పురుషపక్షపాతం మీకు సహజం. నా దృక్పథంతో మీకు నిమిత్తం లేదు. వివాహమనే మిఠాయిపొట్లంతో స్త్రీ ఆత్మని కొనేసి, మీరు వెట్టిచాకిరీ చేయించుకుంటున్నారు. 'బానిసత్వంలో మగ్గిన భారతజాతి స్వతంత్రంగా ఆలోచించలేకపోతోంది' అన్నట్లు, స్త్రీహృదయంకూడా అంత దుర్బలమై పోతోంది. ఆమె లత, కుసుమాంగి, కురంగనయన—యిత్యాదులు. లతని నలిపీ, కుసుమాంగిని వాసనచూసీ, కురంగనయనని బెదిరించీ కాపరాలు చేస్తున్నారు—దేశాన్ని పారతంత్ర్యంలో ముంచిన ఈ పురుషశ్రేష్ఠులు. నేను పిల్లని కనడం, కనకపోవడం నా యిష్టంతో వుంది; నా ఆశలతో కూడుకున్న విషయం. ఈ ప్రపంచమంతా స్త్రీ శక్తివల్ల పోషింపబడుతూ వుంటుంది. పురుషుడు వొట్టి పూజారి; నిమిత్తమాత్రుడు. ఫలానా పూజారి తాలూకు విగ్రహం అంటేనేగాని పూజా పునస్కారాల యోగ్యత లేదా? అదీకాక, మీ సంఘానికి

ఫలానా స్త్రీ, ముద్దర వేయించుకున్న మొగుడిద్వారా సంతానాన్ని వుత్పత్తి చేసిందా లేదా అన్నవిషయం ఖాకబు చెయ్యడం మినహా మరొక పరమావధి లేదా? ఐతే, అలాటి ప్రజల మధ్య నేను వుండను.

ఛ్రుసప వెనక్కి-యినా చూడకుండా వీణ వెళ్ళిపోతుంది.

పంతులు—మతిపోయింది దీనికి!

మూర్తి—వీణ బాధలో నిజం లేకపోలేదు. కాని, ఆమె ధిక్కారం ప్రమాదకరం. (నవ్వుతూ) ఈ ప్రపంచం లోకి వచ్చిన మనుషులు నలిగి నశించడమే యథార్థం, భౌతిక వినాశమే పదార్థ తత్వం...

పంతులు—దీన్ని కన్న ఆ యిల్లాల్ని తలుచుకుంటే నా కడుపు తరుక్కుపోతోందండి. ఆవిడ ఆత్మ...

మూర్తి—ఈవిడ బతుకు?

రోపల కారుహారన్ మోత. వరసగా మూడుసార్లు....పెద్దకలవరం.

పంతులు—ఏమిటో చూసివస్తాను. (వెళ్తాడు)

మూర్తి పచార్లు ఒక అరనిముషం.

పంతులు—(ఆయాసంతో ప్రవేశిస్తూ) మన వీణ మిలిటరీలారీ కింద పడిపోయింది. రోడ్డంతా రక్తమయం...... తల్లిలో కలిసిపోయింది.

మూర్తి—పడాలని పడి వుండదు. ప్రమాదం.

పంతులు—ఏమయితేనేం—మన పరువు దక్కింది.

మూర్తి కొరకొరా చూస్తాడు.

(తెర)

# పెళ్ళికాని పిల్ల

సీత గది అంతా పరిశుభ్రంగా వుంటుంది. కిటికీకి దగ్గిరగా దోమతెరతో కప్ప బడివున్న పందిరిమంచం వుంటుంది. పందిరి మంచంమీద పడుకుంటే, స్వచ్ఛ మయిన సముద్రపుగాలి హాయిగా అనుభవించవచ్చు. రోజ్‌వుడ్ కుర్చీలూ, రెండు మూడు పేముకుర్చీలూ గదిని చిందరవందరగా ఆక్రమించి వుంటాయి. ఒక అందమయిన సోఫా గదికి మధ్యగా వుంటుంది.

సీత వయస్సు సుమారు యిరవై సంవత్సరాలు. కాలేజీలో థర్డ్ యియర్ చదువుతూవుంటుంది. స్త్రీకి అదృష్టవశాన్ని లభ్యమయ్యే సంపూర్ణస్వేచ్ఛకి సంబం ధించిన చిహ్నాలు ఆమె మొహంలో స్ఫుటంగా కనిపిస్తాయి. నిమ్మపండులాటి ఆమె శరీరచ్ఛాయా, పరిపూర్ణత్వాన్ని పొందిన ఆమె అవయవముల శోభా, నవ నాగరికతత్వాన్ని సూచించే ఆమె వేషభాషలూ చాలా ఆకర్షణీయంగా ఉంటాయి.

లలిత సీత నెచ్చెలి. ఫోర్తుఫారం పూర్తి అవగానే, కలెక్టరాఫీసులోని గుమా స్తాకి అర్థాంగి అవుతుంది. పాలిపోయిన ముఖంలో ఎప్పుడో అణగారిపోయిన ఉత్తే జమూ, తేజస్సూ ద్యోతకమవుతూవుంటాయి. సంసారాంబుధిలోపడి, కాఫీకప్పులో పడ్డ ఈగమాదిరి కొట్టుకుంటూ వుంటుంది.

సీత తన నల్లటి కురుల్ని రెండుపాయల జడలుగా అల్లుకొని, రెండు జడలూ ముందుకి వేసుకొని, టెన్నిస్ రాకెట్ తన పక్కగా పడేసుకొని, టెన్నిస్‌కిగాను క్లబ్బుకి పోయే ప్రయత్నంలో వుండి, సోఫాలో ఆశీనురాలయి వుంటుంది. ఆమె తెల్లటి సిల్కుగౌనూ, కాళ్ళకి మేజోళ్ళూ, పాదాలకి తెల్లటి కాన్వాస్ షూజూ ధరిస్తుంది. రాకెట్ ఎడంచేతితోనూ జేబురుమాల్ కుడిచేతితోనూ పుచ్చుకొని, సోఫాలోనుంచి లేవబోతూ వుండగా లలిత ప్రవేశిస్తుంది.

లలిత తెల్లటి కంపెనీ చీరె, రోజారంగు జాకెట్టూ, కాళ్ళకి బర్మీస్ సాండల్సూ ధరిస్తుంది.

**లలిత**—క్లబ్బుకి పోతున్నావా ?

**సీత**—అవును.

చేతిని సీత—తిరిగి సోఫాలో పతికిలబడుతుంది. లలిత దగ్గిరిలోనేవున్న ఒక కుర్చీలో కూలబడుతుంది. సీత షోకుగా రాకెట్ తన భుజంమీద వేసుకొని, మళ్ళీ తన పక్కగా సోఫాలో పడేస్తుంది.

లలిత—ఇవ్వాళ షైకి ఆలస్యంగా బయలుదేరావేం ?

సీత—నువ్వు కూడా మా క్లబ్బులో మెంబరుగా చేరకూడదూ ?

లలిత—ఇక ఇది ఒక్కటే లోపం.

సీత—ఇప్పుడు నీకేంలోటు వచ్చింది ? అందమయిన మొగుడు. ప్రతినెలా డెబ్భయి రూపాయిలు తీసుకొస్తున్నాడు. ప్రతిపండక్కీ కొత్తచీర కొంటున్నాడు. ప్రతి సినీమాకీ వెంటబెట్టుకు తీసుకు వెళ్తున్నాడు. నీ ముద్దు ముచ్చటలు తీరుస్తున్నాడు. నీకేం తక్కువ !

లలిత—అవును సీతా ! నేనంటే నీకు వేళాకోళంగా వుంటుంది. నీకున్నలాంటి అదృష్టం నాలాంటి అభాగినులకి ఎలా ఉంటుందీ ?

సీత—(లలిత మొహంలోకి పరకాయించి చూస్తూ) నేనే అదృష్టవంతురాలినా; నిజంగా ?

లలిత అవునన్నట్లు తల వంకిస్తుంది.

సీత—ఇలా రా.

లలిత కుర్చీలోనుంచి లేచి, సోఫాలోవున్న రాకెట్ తనచేతిలో పుచ్చుకొని, సీత పక్కని కూచుంటుంది, సీత తనచెయ్యి ఆమె భుజంమీద వేస్తుంది. రాకెట్ ఆమె చేతికి బరువుగా ఉందన్నట్లుగా సీత రాకెట్ తీసుకొని, వేరొక కుర్చీమీద ఉంచుతుంది.

సీత——(లలిత మొహంలోకి చూస్తూ) నీకే ఆనందమూ, సౌఖ్యమూ లేకపోతే మరింకెవ్వరికి వుంటాయి ? సాంప్రదాయానుగుణ్యంగా పధ్ధాలుగోయేట వివాహమాడావు. నీకు అన్నివిధాలా ఈడూజోడూ కుదిరిన భర్త. నీ మనస్సెరిగిన మానవుడు. సమిష్టి కుటుంబంలో వుండే బాధలేవయినా వున్నాయా అంటే, వంటమనిషిలా వుపయోగపడే ముసలి అత్తగారు తప్ప అన్యులెవ్వరూ లేరు కదా ! హాయిగా పత్రికలూ, పుస్తకాలూ చదువుకుంటూ కాలం గడుపుతావ్! నీకు తక్కువేముంది? రోజూ మీ ఆయన...(లలిత చెక్కిలి ముద్దాడుతుంది. లలిత పెదవులమీద చిరునవ్వు)...ఇలా వందతఫాలు ముద్దెట్టుకుంటారు, నీ కింకేం కావాలి ?

లలిత——సీతా, నువ్వు చెప్పినవన్నీ నిజమే కాని, ఆయనకి నా మీద అకారణంగా కోపం వస్తూవుంటుంది.

సీత——అలా కోపం తెప్పించుకో కూడదనీ, కోపమే సర్వపాపాలకీ హేతువనీ, కోపంలోనే విచారం వుందనీ, ఒక్కరోజున లెక్చర్ కొట్టు.

లలిత——(పెదవి విరుస్తూ) లాభంలేదు.

సీత——నిన్ను కోప్పడేందుకు ఆయన కెట్టి హక్కూ లేదను. కోప్పడితే వూరుకునేది లేదను నీ వ్యక్తిత్వాన్ని విశదీకరించు; నీ మానవత్వాన్ని నిరూపించు.

లలిత——నువ్వు చెప్తూవుంటే వినడమేగాని, ఆయన ముందు యివన్నీ ఏకరువు పెట్టడం నాకు చేతకాదు.

సీత—అప్పుడేం చేశాం?...యివ్వాళ జరిగిన విషయ మేమిటే?

లలిత—ఆయన కోసం ఆఫీసుకి పంపిన కాఫీలో పంచదార తక్కువ కలిపాను.

సీత—(వేగిరంగా) ఓస్! యింతేనా! మైసూర్ సాండల్ వుడ్ తీసుకురమ్మని నువ్వు చెప్తే, ఆయన హిమానీ గ్లిసరిన్ ఎన్ని సార్లు తీసుకు వచ్చాడో నీకు జ్ఞాపకం వుందా?...... ఊ...పంచదార తక్కువ అయితే?

లలిత—నేను చూస్తూవుండగా గ్లాసులోని కాఫీ పొట్లపాదులో పోసి, నన్ను చెడామడా తిట్టి, నన్ను తీసుకు వెళ్ళకుండా సినిమాకి వెళ్ళిపోయారు.

సీత—(చప్పట్లు కొడుతూ) ట్రాజడీ! పంచదార తక్కువ అయితే కాఫీ పొట్లపాదులో పొయ్యడ మేమిటి? ఏడ్చినట్లే వున్నాయి మీ యిద్దరి తెలివితేటలూ! కాస్త పంచదార కలుపుకు తాగకూడదూ?

లలిత—ఆయన పారపోశారు. నేనేంచేసేది?

సీత—నష్టం కాఫీ కోసమని ఈ రాద్ధాంత సిద్ధాంతా లెందుకు?

లలిత—ఎందుకేమిటి! మొగాళ్ళు కనక...

సీత—మొగాళ్లు...మొగాళ్లు...ఏమిటా మొగాళ్లు? ఆడవాళ్లు వాళ్ళ ఆటలు సాగనిస్తూ వుంటే సరి! ఏమిటి వాళ్ళ అధికృతత!

లలిత—తరతరాల్నుంచీ వారిమాట చెలామణీ అవుతోంది.

సీత—ఈ నాడు అవదు. అవనియ్యవద్దు. స్త్రీ అణిగివున్నంతకాలమూ పురుషుడు యింకా అణగదొక్కుతూవుంటాడు. నలభైఏళ్లు దాటిన తర్వాత మానాన్న సంఘసంస్కారి అయాడు. అంతకిపూర్వం అమ్మని చావమోదుతూవుండేవాడట.

లలిత—(ఆశ్చర్యంతో) కొట్టడమే !

సీత—అవును. నిన్నూ కొడ్తాడు మీ ఆయన, యింకా కొన్నాళ్లు పోతే, అంతదాకా నువ్వు ఆయన ఆటలు సాగనిస్తూవుంటే! అసలు మా అమ్మకీ నాన్నకీ కాఫీగింజల దగ్గర వచ్చింది పేచీ. ఆయన రెండున్నర వీశెలు చాలునన్నాడు. ఈమె మూడువీశెలు అవసరమంది. ఇద్దరూ కాసేపు కీచులాడుకున్నారు. ఆయన తిట్టాడు. ఆమె ఎదిరించింది. అక్కడితో ఆఖరు. ఆ రోజునుంచీ నాన్న అమ్మమాట కాదంటే వట్టు.

లలిత—(నవ్వుతూ) మళ్ళీ కీచులాటలు యింకెప్పుడూ రాలేదూ ?

సీత—రాకేం...ఆయనకి కోపం వచ్చినప్పుడల్లా మా అమ్మ గర్జించేది. లాభం లేదనుకుంటూ, నిస్పృహతో ఆమె మాట కాదనడం నాన్న మానుకున్నాడు. ఆయన సంస్కారజీవితానికి మొట్టమొదటి మెట్టు అది. మొగాడు గోడుగు

తీసుకు కొట్టబోతే, ఆడది గరిటె అట్లకాడా శంఖుచక్రల్లా వుపయోగిస్తూ ఎదురు తిరగాలి. ఆనాడే నారీజీవితం సార్థక మవుతుంది.

లలిత—సీతాదేవి పేరు చిరస్థాయిగానిలుస్తుంది.

రామస్వామి, సీతతండ్రి, అరవైసంవత్సరాల వృద్ధుడు. ముక్కుమీదనుంచి జారిపోయే కళ్ళజోడూ లాంకోటూ, తెల్లధోవతీ, వుల్స్లిప్పర్లూ అతని వేషం. గెడ్డం మాసివుంటుంది. ఆలోచనలు ఎక్కువైపోయో వేదాంతరహస్యాలు యిము డ్చుకోలేకనో తలనెరిసి వుంటుంది. భార్య గతించినప్పట్నుంచీ మౌనమే అతని జీవితానికి ఆలంబనం. ఒక డైలీపత్రిక చేతిలో పుచ్చుకొని మధమధ్య చదువుతూ ప్రవేశిస్తాడు.

రామస్వామి—అమ్మాయీ, యివ్వాళ టెన్నిస్ మానే శావేం! వ్యాయామం లేకపోతే ఆరోగ్యం చెడుతుంది.

సీత—లలిత తన గొడవలు చెప్పుకుంటూ నన్ను క్లబ్బుకి పోనియ్య లేదు.

రామస్వామి—లలితకి గొడవలా?

సీత—ఏం? ఉండకూడదా?

రామస్వామి—ఉండకూడదని నేను అనను, ఎందుకు వుండాలని అడుగుతాను. ఈడూజోడూ......అవును గాని, అమ్మాయ్, మధ్యాహ్నం బారిస్టర్ నాతో చాలాసేపు మాట్లాడాడు. అతని విషయం ఏమంటావు?

సీత—ఏమంటాను? అతను వట్టి బ్రూట్ అంటాను. ఇంగ్లండు వెళ్ళి రావడంచేత తనకి తెలీని విషయాలేమీ వుండవని అతని అపోహ.

లలిత—బారిస్టర్ నిశ్వాం విషయమేనా నువ్వు అంటున్నది ?

లలిత—అతనికి మంచి పలుకుబడి వుందన్నారు మా ఆయన.

సీత—(నిశ్చలంగా) ఉండవచ్చు చాలా పలుకుబడి వుండవచ్చు. నంది పంది అనీ, పంది నంది అనీ నిరూపించగల సమర్థుడు కావచ్చు. కాని, నాకు భర్తగా మాత్రం తగడు. నా భర్త అనిపించుకొనేపాటి యోగ్యత అతనిలో లేదు.

రామస్వామి—(వెటకారంగా) శెభాష్! అసలు పెళ్ళే చేసుకోవా ?

సీత—ఎందుకు చేసుకోవాలి ?

లలిత సీతమొహాన్ని పరీక్షగా చూస్తుంది. సీత చిరునవ్వు. రామస్వామి ఈ వైపునుంచి ఆ వైపుకి ఒక్కసారి పచారు చేస్తాడు.

రామస్వామి—సీతా, అనుభవాన్ని మించిన జ్ఞానం యింకోటిలేదు. అనుభవాలతో ఈ శరీరం ముడతలు పడిపోయింది, వయస్సు మళ్ళిపోయింది, వెంట్రుకలు నెరిసిపోయినై. నీకు అనుభవం లేదు. నాకు అనుభవం వుంది. నువ్వు వివాహం చేసుకుంటేనేగాని నీకు సౌఖ్యం లేదు; నాకు శాంతిలేదు.

సీత—మీకు శాంతి లేదన్నమాట వప్పుకుంటాను గాని, నాకు సౌఖ్యం లేదన్న విషయం అంగీకరించను. నేను ఒకరికి దాసీనైపోవడం నా కెంతమాత్రం సౌఖ్యం కానేరదు.

లలిత—దాసీత్వమేమిటి, సీతా !

రామస్వామి—లలితా, వివాహమంటే పురుషుడికి వూడిగం చెయ్యడమని నీ స్నేహితురాలి అభిప్రాయం.

లలిత—అంతేనా, సీతా ?

సీత—(లలితను ఉద్దేశిస్తూ) ముమ్మాటికీ ! ప్రస్తుత సంఘంలో, పరిస్థితుల్లో పెళ్ళంటే స్త్రీకి దాసీత్వమే ! నీ అనుభవాలు నిన్ను మోసం చేస్తున్నాయా ?

రామస్వామి—భార్యాభర్తలలో విభేదాలు ఏర్పడినపుడూ, క్లిష్టసమస్యలు ఎదుర్కోవలసి వచ్చినపుడూ ఒకరిమీద యింకోరికి ఒకమాదిరి విరక్తి అంకురార్పణ అవుతుంది. కాని, అంతమాత్రాన్నే వివాహమనే సంస్కారం దాస్య బంధం అని తేల్చెయ్యడం సాహసం.

సీత—వివాహమనే బండెల దొడ్లో కాలుపెట్టి, నా యిష్టాల్నీ కోరికల్నీ హతమార్చుకొని యింకోరి యిష్టాల్నీ కోరికల్నీ అనుసరించి ప్రవర్తించ వలసిన అగత్యం నాకేం పట్టింది ? ఈ దేశంలోపుట్టి, ఈ సంప్రదాయంలో పెరిగి, ఈ సంఘాచారాలకీ కులమర్యాదలకీ అనుగుణంగా నడుస్తున్నంతకాలం ఈ మానసిక దౌర్బల్యం ప్రతిహృదయాన్నీ ఆవరించుకు ఉంటుంది.

లలిత—నువ్వు మాత్రం ఏ దేశంలో పుట్టావ్, ఏ సాంప్రదాయంలో పెరిగావ్ ?

రామస్వామి—(బోసిపళ్ళు బయటపడేటట్టు నవ్వుతూ) మంచి ప్రశ్న వేశావ్ ?

సీత—నా బాగోగులు నేను నిర్ణయించుకో గలను.

రామస్వామి—అందుకే వివాహం వద్దంటున్నావు కాబోలు!

సీత—అవును. దాస్యం చేసేందుకు నేను Contract వ్రాసి యివ్వను.

రామస్వామి—అది Contract కాదు. Sacrement. ఇహపరాలకి సూత్రం. ధర్మమూ, న్యాయమూ, పవిత్రమూ, సున్నితమూ అయిన స్త్రీ పురుష బాంధవ్యం.

సీత—మనస్సుల్ని మర్దిస్తూ సంతోషాలకి చిచ్చు పెట్టి శరీరాల్ని అయిక్యంజేసే మాయాబంధం కాదూ?

రామస్వామి—(లలితని ఉద్దేశిస్తూ) అమ్మాయీ, లలితా, సంసారంలో అనేక లోటుపాట్లు వస్తూవుంటాయి. ఏఒక్కరూ భీష్మించుకు కూచోకూడదు. సర్దుకుపోతూ వుండాలి. లేక పోతే బండి నడవదు.

లలిత—(వివాహ మయిన స్త్రీకి సహజంగా వుండే నమ్రతతో) అవునండీ.

సీత—(చిరునవ్వుతో) అవును. నువ్వు అవునంటావ్! వివాహ మయింది కనక నీకు నీతి భయం. నువ్వు వినయమూ, నమ్రతా తెలుసుకొన్నావ్! ఆ మెత్త మెత్తని మాటలు నాకేం అవసరం! నన్ను గౌరవిస్తే, నేను ఆదరంతో గౌరవిస్తాను; నన్ను అగౌరవిస్తే, నేను అవమానిస్తాను—అంతే. పెళ్ళి అయినదానిని కనక నీకు నీతి

భయం. మొగు డేమనుకుంటాడో, లోకు లేమనుకుం టారో...నాకేం...

లలిత—(రామస్వామిని ఉద్దేశిస్తూ) బాబుగారూ, మన సీత పెళ్ళి చేసుకోనంటుం దేమిటండీ ?

రామస్వామి—నే నెంతవరకూ చెప్పగలనమ్మా! ఆ మంచి చెడ్డలు దానికి తెలియాలిగాని.

సీత—ఇవ్వాళ టెన్నిస్‌కి వెళ్ళాలని లేదు; సినీమాకి పోదాం. రావే, లలితా.

ఇద్దరూ నిష్క్రమిస్తారు. రామస్వామి పేపరు చూసుకుంటూ పచార్లుచేస్తూ వుండగా,

# ఉత్తరం

భానుమతిభర్త సౌధం. ఉదయం సుమారు తొమ్మిదిన్నర గంటలవేళ.

విశాలమయిన సావిడి. కుర్చీలూ, మేజాలూ, సోఫాలూ గృహ యజమాను రాలికి క్రమత మీద వుండే అభిమానాన్ని సూచిస్తున్నట్లుగా—క్రమపద్ధతిలో అమర్చబడి వుంటాయి. సావిట్లోకి ప్రవేశించగానే కుడివైపునా ఎడంవైపునా సిల్కు గుడ్డలతో లావణ్యాన్ని వెదజల్లుతూ వున్న రెండు విశాలమయిన సోఫాలు కని పిస్తాయి. సోఫాలకి వెనకతట్టున రెండేసి కుర్చీలూ, మూలల్ని ఒక్కొక్క కుర్చీ వుంటాయి. అక్కడ వున్న కుర్చీలమొత్తం ఎనిమిది. సోఫాంకి వెనక భాగంలో వున్న కుర్చీలు రక రకాల నగిషీలతో వుంటాయి. నాలుగు కుర్చీలమీది చెక్కడపు పనీ ఒకే పద్ధతికి చెంది వుంటుంది. బహుశా ఆ నాలుగు కుర్చీలూ ఒకే పనివాని అజమాయిషీలో తయారయి వుండవచ్చు. మూలల్ని నగిషీలు లేకుండా నిరా డంబరమయిన అందం కలిగిన రోజ్‌వుడ్ కుర్చీలు వుంటాయి. ఆడంబరం లేని ఒక యుగపు అందాన్ని నగిషీలతో కూడుకున్న మరో యుగపు అందంతో ఈ గృహిణి ఎలా సమన్వయింప చెయ్యగలిగిందా అన్న ప్రశ్న ప్రతి బుద్ధి మంతుడికి తట్టుతుంది. రెండు సోఫాలకీ మధ్యని ఒక చిన్న మేజాబల్లవుంటుంది. దానిమీద పరిచిన అల్లికగుడ్డ బహుశా ఆ యిల్లాలే అల్లికపట్ల మీద అపేక్ష ఎక్కువగా వున్న రోజుల్లో, కుట్టినదయి వుంటుంది. ఆ మేజామీద ఒక గాజు కూజా ఆ కూజామీద మూతగానూ, తాగేందుకు వుపయోగ పడేందుకు గానూ, ఒక గ్లాసూ వుంటాయి. కాలంలోని కదలికని క్షణక్షణానికీ కొలిచే ఒక పెద్ద గడియారం ఆ సావిట్లో వున్న వస్తువులన్నిటిలోనూ ముఖ్యమయినది, ప్రవేశించ గానే ఎదురుగా కనిపించే గోడకి బొమ్మలేవీ లేవు. ఎడంవైపు గోడకీ, కుడివైపు గోడకీ, వెనకవైపు గోడకీ చంద్రశేఖరం దంపతుల ఫొటో, మహాత్ముని చిత్రమూ బుద్ధభగవానుని పటమూ వరసగా వుంటాయి. కుడి మూలనుంచి గృహాంతర్భాగం లోకి దారి.

తెర ఎత్తిన రెండు నిముషాల వరకూ గడియారం చేసే ధ్వని తప్ప యితర సందడి ఏమీ వినిపించదు.

అరవింద ప్రవేశం. అరవిందకి పాతికేళ్ళు. వయస్సుకి మించిన విజ్ఞానమూ, విచారమూ ఆమె ముఖంలోనుంచి తొంగి చూస్తూవుంటాయి. ఆమె చేతలలోనూ, పలుకులలోనూ, విలాసం ఉట్టిపడుతూ వుంటుంది. ప్రవేశించగానే సోఫాలో చతికిల బడి, సోఫాకి పక్కనివున్న కాలింగ్ బెల్ నొక్కుతుంది. ఆ ప్రవేశించిన పద్ధతీ, కూచున్న ఫక్కీ గమనించగానే ప్రతివారికీ అరవింద ఈ యింటికి చిరపరిచితు రాలా అన్న భావం తోస్తుంది.

కాలింగ్ బెల్ ధ్వని.

చేతిలో ఒక దినపత్రికతో గృహకాంత భానుమతి "నమస్తే" అంటూ ప్రవేశి స్తుంది. భానుమతి వయసు ముప్ఫయిమూడు. ఆమె మొహంలో ఏదో చెప్పరానిదీ చెప్పలేనిదీ అయిన దిగులుకి సంబంధించిన జాడలు కనిపిస్తాయి. విశాలమయిన ఆమె కళ్ళల్లో విచారం తొణికిసలాడుతూ వుంటుంది. అరవింద కూచున్న సోఫా లోనే, ఆమె పక్కగా భానుమతి ఆశీనురాలవుతుంది.

అరవింద—(పెదవులమీద నవ్వు కనబరుస్తూ) ఇంకా ఎందుకండీ ఈ నమస్తేలు !!

భానుమతి చిన్నబుచ్చుకోదుగాని ఆ రిమార్కుని అంత సీరియస్‌గా తీసుకోదు- తను నమస్కరించి నప్పుడల్లా అరవింద ఆ రకంగా విమర్శించడం తనకి అలవాటు అయిపోయిందా అన్నట్లుగా !

భానుమతి—మీకు నమస్కరించ కూడదనే అను కుంటాను కాని, అలవాటు చొప్పున నమస్తే అనేస్తూ వుంటాను. అయినా, అరవిందా, యిది సదాచారాలలో ఒకటిగానే పరిగణించాలి.

అరవింద—ఈ సదాచారం మనస్సుల కలయికకి తోడ్పడుతుందని వొప్పుకుంటాను. కాని, మనస్సులు కలిసిన తర్వాత ఈ ఆచారంతో నిమిత్తం లేదు. అప్పుడది శుష్క మయిన ఆడంబరంలా తోస్తుంది. కాదంటారా ?

భానుమతి—(వాదించటం యిష్టం లేనట్టుగా) మీరు చెప్పినది నిజమే కావచ్చు. కాని అందరు స్త్రీలూ భానుమతులూ అరవిందలూ కారు.

అరవింద—(సంభాషణ మార్చాలని చూస్తూ) ఇవ్వాళ మీరు ఎలాగో వున్నారు. మీ కళ్ళు ఎర్రగానూ బరువుగానూ కనిపిస్తున్నాయి. రాత్రి ఎక్కువసేపు చదివారా ?

భానుమతి—చదువూ లేదు, సంధ్యాలేదు. రాత్రి నిద్ర పట్టేటప్పటికి మూడయింది.

అరవింద—ఏం — పగటివేళ ఎక్కువసేపు నిద్ర పోయారా ?

భానుమతి—ఊహూ ! ఏదో మార్పు నాలో రాబోతోంది. ఆ మార్పు ఎలాంటిదో, ఏమూలనుంచి వస్తుందో, ఏమాదిరిగా వస్తుందో తెలీడంలేదు. పాము తన పొర వదిలేసినట్టు, నేను ఈ పొర వదిలేసి ఎక్కడికో పోతానేమో అనిపిస్తోంది. నా కూతురూ, నా కుమారుడూ, నా భర్తా వీరెవరూ నా వాళ్ళు కారు. అందరూ నాకు దూరులే.

అరవింద—(ధోరణి గ్రహించ గలిగికూడా) వేదాంత గ్రంథాలు ఎక్కువగా చదివి అనవసరంగా మీరు మనస్సు పాడు చేసుకుంటున్నారు.

భానుమతి—నేను మనస్సు పాడుచేసుకోవడం లేదు. మనస్సుని పూర్వం కంటె పరిశుభ్రంగా వుంచుకో గలుగుతున్నాను. ఇప్పుడు దృష్టి చక్కగా వికశిస్తోంది. బుద్ధి

'లేడిపిల్ల'లా పరిగెత్తగలుగుతోంది. క్లబ్బులో శెక్రటరీని అవుదామని వోట్లకోసం నేను పడ్డ తిప్పలు ఈనాడు తలుచుకుంటే నా అవివేకానికి నాకే సిగ్గవుతోంది. ఎందుకు మనోరమతో అన్ని అబద్ధాలు చెప్పాను? ఎందుకు వసుంధరాదేవిని అన్ని బోల్తాలు కొట్టించాను? ఎందుకు? ఎందుకు చెప్పండి? Vanity. నా అసూయకపు Vanity.

అరవింద—ఈ Vanity ప్రతి జీవిలోనూ వుందండి. మీలోవుంది; నాలోవుంది; మీ భర్తలోవుంది. కారు కండక్టర్‌లోనూ వుంది; కాబూలీవాలాలోనూ వుంది. సర్వమానవ కళ్యాణసిద్ధికోసం తమ సమస్తమూ త్యాగంచేసిన మహానుభావులలోనూ వుంది, ఆరణాలకోసం ఎంతటి అఘాయిత్యాని కయినా వెనుకాడని రాక్షసుడిలోనూ వుంది. అందుకోసం మీరేమీ దిగులు పడ నక్కరలేదు. అది అలా వుంటూనే వుంటుంది. ఎటొచ్చీ, సత్యాన్వేషణలో ఈ 'అహం' క్షీణించిపోతూ జీవన్ ముక్తికి సాధనగా వుపయోగపడుతుంది.

భానుమతి—బడిపిల్లవాడు 'కాసబియాంకా' వప్పజెప్పినట్లు మీరు ఎంతో తేలికగా ఏ మాత్రపు ఉద్వేగమూ లేకుండా చెప్తున్నారు.

అరవింద—అవును. ఆయాస పడడంవల్లా, వుబలాటపడడంవల్లా ప్రయోజనం అంతగా వుండదు. ఏ పనీ తొందరలో చేసి తీరికగా విచారించకూడదు. మీరు ధైర్యం

చిక్కబట్టుకోవాలి. పుత్రుడూ, పుత్రికా, పతీ, బంధువులూ, సన్నిహితులూ, సిరిసంపదలూ వున్న మీరే ఇలా అకారణంగా అవస్త తెచ్చిపెట్టుకుంటూవుంటే, యిందులో ఏ ఒక్కటీలేని నాలాటివాళ్ళు ఏమవాలి ? నేను ఏకరువుపెట్టిన వాటిలో ఏ ఒక్కటీ మీకు సౌఖ్యాన్ని యివ్వలేకపోవచ్చు. కాని, ఒక్కవిషయం మీరు ఏ అవస్తలోనూ, ఏ సందర్భం లోనూ మర్చిపోకూడదు. యథార్థం ఏమిటంటే—వాటిలో శాంతిని యివ్వగలిగే గుణంగానీ, లక్షణంగానీ ఎప్పుడూ లేదు. ఎప్పుడయినా అవి తాత్కాలికమయిన సంతోషాన్నీ, సౌఖ్యాన్నీ మాత్రమే యివ్వగలవు. ఆ తాత్కాలి కోత్సాహాలు శాంతిని యివ్వగలవని యింతకి పూర్వం భ్రమించారు; ఇవ్వలేవని యిప్పుడు నిజం తెలుసుకున్నారు.

భానుమతి—మీరు చెప్తున్నది నా భావాలకి దగ్గిరిగానే వుంది. ఈ యిల్లు లోకదృష్టిలో నాదేకావచ్చు. 'నిజానికి నీదికాదు' అని నా మనస్సు నన్ను భయపెడ్తోంది. నే నెందుకు ఈ యింట్లోవున్నాను ? ఈ యింట్లో నాకేమైనా ప్రత్యేకత వుందా ? చంద్రశేఖరాన్ని వివాహమాడాను కనక ఈ భవనంలో వున్నాను. కమలాకరాన్ని పెళ్ళి చేసుకునివుంటే, పూనాలో వుండివుందును. క్షీరసాగరం అయితే కలకత్తా. నాలోని స్త్రీత్వం చిందులు తొక్కక పూర్వం ఒక పురుషుడికి వప్పజెప్పాను. ఆ రోజునుంచీ నేను 'ఫలానా ఆయన భార్యని' అయాను. ఆయన కోసమూ,

ఆయన వంశంకోసమూ, నాకు శాంతిని యివ్వలేని సంఘం కోసమూ, యిద్దరు పిల్లల్ని కని, పెంచి, యిచ్చాను.

అరవింద—ప్రతి విషయమూ క్రమపద్ధతిలో, యితరులకి అతి సులువుగా అర్థమయేవిధానంలో, చెప్పే అలవాటువున్న మీరు ఈ నాడు అంత అస్పష్టంగా మాట్లాడుతున్నారేమిటి!! మీరు Feelings కంటె Facts చెప్పగలిగితే మీ బాధని నేనుకూడా పంచుకోగలనేమో !

భానుమతి—నేను పద్ధెనిమిది ఏళ్ళు ఎలా వుండగలిగాను ఈ యింట్లో ? ఇప్పుడు క్షణమొక యుగంలా తోస్తోందే ! నేను సంఘానికి చేసిందేమిటి, లోకానికి చేసిందేమిటి ? నాకు... నేనేం చేసుకోగలిగాను ? (ఉద్రేకంతో) పొత్తిళ్ళలోవున్న పాపతో తల్లి దారిద్ర్యనరకం అనుభవిస్తూ వుంటే, స్నేహితులతో కూడా కారులో విందుకిపోతూ, బిచ్చగాళ్ళంటే ఏవగించుకున్నాను ? నాతోడి జాతి అంతా అర్థవిహీనమయిన ఆచారాల్లోనూ, మూఢమతోద్రేక సిద్ధాంతాలలోనూ యిరుక్కుని మగ్గిపోతూవుంటే ఎనిమిది వుపన్యాసాలు యిచ్చి, ఆరు వ్యాసాలు రాశాను ? ఈ ప్రపంచమంతా ఒక లీల, యిదంతా మిథ్య—అనే ప్రతి వారినీ ఖండించి, వారితో హోరాహోరీ వాగ్వాదం సలిపి, యిప్పుడు నేనూ ఆ మెట్లుమీదికే వచ్చి, వెనక్కి తిరిగి చూసుకుని తెంబేలు పడుతున్నాను !!

భానుమతి కళ్ళు చెమ్మగిల్లాయి, కంఠం బొంగురు పోతుంది.

అరవింద—(భానుమతి మొహంలోకి చూస్తూ) అదేమి టండీ, అంత ఢీలతనంగా......

భానుమతి—ఏముంది, అరవిందా! నా జీవితానికి ఆదర్శ మనేది ఒకటి లేకపోయింది. ఏదో ఒకదాన్ని ఆదర్శంగా పెట్టుకోగానే కొంత త్యాగం చెయ్యవలసిన అవసరం కలుగు తుంది. ఒక తఫా సత్యాగ్రహోద్యమంలో జేరాలని వెర్రి ఆసక్తి పుట్టింది. సిల్కు చీరెలన్నీ అగ్నిహోత్రుడి పాలుజేసి ఖద్దరు చీరెలు కొందామనుకున్నాను. కాని? పికెటింగు చెయ్యాలి; జైలుకి పోవాలి. జైలుకిపోవడం అంటే జంకు పుట్టింది. ఆ జడుపువల్ల ఖద్దరుధారణవల్ల దేశానికి పెద్ద ప్రయోజనం కలగనేరదనే ప్రచారం మర్నాట్నుంచీ ప్రారం భించాను. నిజానికి నేను చేసిన ప్రచారంలో నాకే నమ్మకం లేదు. నేను సత్యాన్ని అసత్యానికి బలి యిస్తున్నానని హృదయంలోని ఒక మారుమూలనుంచి అంతర్వాణి పలుకు తూనే వుంది. ఆత్మ చేసిన ప్రబోధాన్ని ఎన్నోసార్లు పెడచెవిని పెట్టాను. ఆత్మని వంచించడానికి ప్రయత్నం చేశాను. అంటే నన్ను నేను మోసం చేసుకున్నాను. కాని, నా కానాడు తెలీదు-యిదంతా ముందుముందు తీరని అశాంతికి దారి తీస్తుందని. చుక్కాని లేని నావకి, నష్టాల్లో సంభవించే గతే ఆదర్శంలేని జీవితానిక్కూడా ప్రాప్తిస్తుంది.

అరవింద — మీరు చెప్పున్న విషయాలలో వేటితోనూ నాకు పేచీలేదండీ. మీ Feelings కంటె Facts చెప్పండని కోరుతున్నాను.

భానుమతి—అంతరాత్మ ప్రబోధం అణచిపెట్టడం పది సేనోపట ప్రారంభించాను.

అరవింద—సందర్భం ?

భానుమతి—(తెంపరితనంతో) ఇప్పుడన్నిటికీ తెగించే శాను. ఎవరు ఏ విషయం అడిగినా చెప్పేస్తాను. నిజం చెప్పే స్తాను—నిష్ఠూరంగా వున్నా సరే! మీదగ్గిర యిన్నాళ్ళ నుంచీ దాచిన రహస్యం, అతి గూఢంగా హృదయ పేటికలో దాచుకున్న అమూల్యమయిన ఆవేదన, యిది ఒక్కటే...

అరవింద—(మొహంలో కొద్దిగా ఆతురతతో) చెప్పండి.

భానుమతి—నేను చిన్నతనంలో ఒకర్ని ప్రేమించాను. అతన్ని నేను ప్రేమిస్తున్నానని తెలుసుకునే వేళకి నాకు వివాహం అయిపోయింది. 'నేను యింకోరి భార్యని—అతన్ని ప్రేమించేందుకు నాకు హక్కులేదు' అని తెలీగానే, ఆ హక్కు ప్రతి ఆడదానికీ కావాలని, సంఘం మీద తిరుగుబాటు చేసి పోరాడాను. విడాకులు గురించి నేను ఎన్ని వ్యాసాలు రాసినా, ఎన్ని వుపన్యాసాలు యిచ్చినా నన్ను ప్రేరేపింప జేసిన మహత్తరశక్తి నాలో లేదు; బయటవుంది. ఆ శక్తి నేటికి పద్ధెనిమిది సంవత్స రాలకి పూర్వం దానిమ్మచెట్టునీడలో నుంచుని 'భానూ, ప్రపంచపు రీతి నీతులు తెలీక నువ్వు భయభ్రాంతురాల వవుతున్నావు; నీ భర్త నిన్నేమీ అనలేదు; లోక జ్ఞానం వున్న ఏభర్తా యిలాటి సందర్భంలో నోరెత్తడు.

ఈ బంధుగులందరూ చూపే ఆదరణ కంటె మన ప్రణయంలోని పవిత్రతకి ఎక్కువ విలువ వుంది; ఒక్కమారు సమాజ నియమాల్ని ధిక్కరించు. అందరూ హడలి నోరు మూసుకుంటారు. రెండు జీవితాల భవిష్యత్తు నీనిర్ణయం మీద ఆధారపడి వుంటుంది' అన్న శంకరం పలుకులలో వుంది. అప్పటికి నాకు పెళ్ళి అయింది కాని, యింకా కాపరానికి రాలేదు.

అరవింద—(విచారం కనబరుస్తూ) ఎంత ట్రాజడీ జరిగిందండీ!! ఇప్పుడాయన ఏమయారు ?

భానుమతి—ఏమీ అవలేదు. ఉన్నాడు. మొదటి పది సంవత్సరాలూ 'ఏనాడో ఒకనాడు నువ్వే తిరిగి వస్తావు—ద్వారం ఎప్పుడూ తెరిచే వుంచుతాను,' అనేవాడు.

అరవింద—తర్వాత ?

భానుమతి—ఒకసారి ఉత్తరంలో రాశాడు—'భానూ, నాబతుకంతా తాడుతెగిన గాలిపటంలా అయిపోయింది. జీవితశేషాన్ని ఒక ఉన్నతాదర్శంకోసం గడపాలని ప్రయత్నిస్తున్నాను. ఎవ్వరూలేని ఏకాకిని నేను; అందరూ వున్న మర్యాదస్తురాలివి నువ్వు.' జాలేసింది. ఆ రాత్రి ఆలోచించాను—విడాకుల చట్టం శాసనమయే అదృష్టమే ఈ దేశానికి పడితే, నేను శంకరం దగ్గిరికిపోయి యథేచ్ఛగా జీవించగలనా అని. వొట్టి అబద్ధం. వృథాప్రయత్నం. నేను

వెళ్ళలేను. కొత్తగా పెంచుతున్న రామచిలుకల్నీ, ఇంగ్లీషు పేర్లు చదువుతున్న అమ్మాయినీ, కుర్చీలూ బల్లలూ ఆసరాగా పట్టుకు నడిచే అబ్బాయినీ, నేను వేసిన విత్తుల్నీ నేను పెంచిన మొక్కల్నీ వదిలేసి శంకరం దగ్గిరికి వెళ్ళలేనని, వేడితనం పోగొట్టుకొని ప్రశాంతంగా ప్రవహిస్తున్న నా రక్తం, నిర్మొగమాటంగా చెప్పింది. జవాబా ఈ దేహం కోరికల పుట్ట అంటుంది. అది నిజం కాదు. మానసిక బాధతో చూస్తే దేహబాధ బహు స్వల్పమయినది. ఆ పది సంవత్సరాల్లోనూ దేహం తన వాంఛలన్నీ తీర్చుకుంది. కాని, మనస్సో ?

అరవింద—నిజమే! మనస్సు దేహాన్ని పరిపాలించగలదు, కాని, దేహం మనస్సుమీద అధికారాన్ని చెలాయించ లేదు. వాస్తవంగా మనస్సుకే ఎక్కువ ప్రాధాన్యత యివ్వాలి. ఇన్ని సంవత్సరాలు మీరా వ్యామోహంలో ఎలా వుండగలిగారూ ? వ్యామోహానికి లోబడిపోయినా లోబడిపోవాలి, లేదా, జయించనయినా జయించాలి. కాని, ఆ వ్యామోహానికి మీరిలా బందీ అయిపోవడం నేను సహించ లేను.

ఇద్దరూ కొద్దికాలం మౌనంగా కూచుంటారు.

నౌకరు ఉత్తరాలు తీసుకువచ్చి, అమ్మగారి చేతికిచ్చి వెళ్ళిపోతాడు. ఉత్తరాల్లో, ఒక వారపత్రికా, ఇన్సూరెన్సు కంపెనీనుంచి వచ్చిన ఒక రశీదూ, ఒక కవరూ వుంటాయి. భానుమతి కవరు చేతితో పుచ్చుకుని అడ్రసు రాసినవారి దస్తూరీ పరిశీలిస్తూ వుంటుంది. కవరు చింపబోతూవుండగా గడియారం గంగు గంగు

మంటూ పది కొడుతుంది. ఈ శపనానికి ఫలితం ఏమైవుంటుందా అన్నట్లుగా యిద్దరూ వెలా వెలా బోతూ గడియారం వంక చూస్తారు.

ఇంతలో అమ్మాయీ, అబ్బాయీ స్కూలుకి పోబోతూ సావిట్లోకి వస్తారు. అమ్మాయి పదిహేనేళ్ళ ఖులాసా పిల్ల. అబ్బాయి పన్నెండేళ్ళ అమాయకుడు. అమ్మాయిలో తల్లిపోలిక మూడు మూర్తులా కనిపిస్తుంది.

అమ్మాయి అరవిందని వుద్దేశించి "నమస్తే" అంటుంది. అబ్బాయి అమ్మాయి అడుగుజాడల ననుసరిస్తాడు. ఇద్దరికి ప్రతినమస్కారం చేస్తుంది అరవింద.

**అరవింద—(భానుమతితో) చిన్నతనంలో మీరు ఈ అమ్మాయి మాదిరిగానే వుండే వారనుకుంటాను.**

భానుమతి కొద్దిగా సిగ్గుపడుతుంది.

**అమ్మాయి—అమ్మ చిన్నతనంలో అచ్చంగా నాకు మల్లేనే వుండేదని నాన్నగారు అంటారు.**

**అబ్బాయి—కాని, కళ్లుమాత్రం నా కళ్ళండీ!**

**అమ్మాయి—కాదండీ, చెవులు మా తమ్ముడివండీ, కళ్ళు నావే! చూడండి, మా అమ్మవీ, వాడివీ కూడా దొప్ప చెవులు.**

**అబ్బాయి—కాదండీ, అక్కయ్య ఎప్పుడూ అబద్ధాలే చెప్తుంది. నిన్న రాత్రి సినిమాలో చాక్లెట్లు అన్నీ తను తినేసి, నేను తిన్నానని నాన్నగారితో అబద్ధం చెప్పింది. అక్కయ్య వొట్టి అబద్ధాలకోరు.**

**అమ్మాయి—(అబ్బాయితో) వెధవ్వా—నువ్వే వొట్టి అబద్ధాలకోరువి! పయిగా, నా మీదికి తోస్తావెందుకు నిందలన్నీ!**

అబ్బాయి—(అమ్మాయితో) అయినా, నువ్వో నేనో 'దొంగా—దొరా' చీట్లు వెయ్యి—తెలుస్తుంది.

అరవింద తపలో తను నవ్వుతుంటుంది.

భానుమతి—అమ్మాయీ, అదేమిటే చిన్నపిల్లలా దెబ్బలాడుతావ్ తమ్ముడితోను ?

అమ్మాయి—చిన్నపిల్లని కానా ?

భానుమతి—పదిహేనేళ్ళు వచ్చినా ఇంకా చిన్నతనమా ? నీ యీడుకి నేను కాపరానికి వచ్చాను.

అమ్మాయి—ఉద్ధరించావ్ ! నాన్నగారూ మిస్సమ్మా—పిల్లలు పుట్టేదాకా ఆడపిల్లలు చిన్నపిల్లలతోటే సమానమని చెప్పారు.

భానుమతి—(పిల్లల్ని గదమాయిస్తూ) స్కూలుకిపొండి. అప్పుడే పదిదాటింది.

అమ్మాయీ, అబ్బాయీ నిష్క్రమిస్తారు.

అరవింద—ఆ పత్రిక యిటు పడేసి, ఉత్తరం చదువుకోండి.

భానుమతి—పత్రికమాటకేంగాని, యివ్వాళ సంఘటనలన్నీ విచిత్రంగా జరుగుతున్నాయి.

[అమ్మాయి తిరిగి ప్రవేశిస్తుంది]

అమ్మాయి—అమ్మోయ్, చెప్పడం మర్చిపోయాను. సింధురాష్ట్రంలో ఆడపిల్లలకూడా ఆస్తి పంచిపెట్టాలనే శాసనం వచ్చిందట కాదూ ?

భానుమతి—(విసుగ్గా) ఊఁ, వెళ్ళు. స్కూలుకి వెళ్ళి చక్కగా చదువుకోక చట్టాలూ శాసనాలూ నీకెందుకు?

అమ్మాయి—నువ్వేకాదూ రోజూ పత్రిక చదవడం మంచిదని చెప్పావ్!

భానుమతి—(కఠినంగా) ఊఁ, చెప్పాను. ముందు స్కూలుకి దయచెయ్యి.

అమ్మాయి కూనిరాగం తీస్తూ నిష్క్రమిస్తుంది.

అరవింద—ఈ కాలపు ఆడపిల్లలు మనల్ని తలదన్నే టట్టు వున్నారు.

భానుమతి—మా అమ్మాయి మరీ అల్లరిపిల్ల అవు తోంది.

అరవింద—అందరూ అంతేలెండి. మీవాళ్ళే కొద్దిగా నయం.

భానుమతి—(సంభాషణ మారుస్తూ) ఈ ఉత్తరం శంక రందగ్గిర్నుంచి. లోపలి విషయాలు చదివేందుకు నాకు చాలా భయంగా వుంది.

అరవింద—ఏం, తరుచూ ఉత్తరాలు రాస్తూవుండరా ఆయన?

భానుమతి—అతనంత తరుచుగా రాయడు. ఏ ఆరు నెలలకో సంవత్సరానికో ఒకటి రాస్తాడు. కాని, ఒక్కొక్క ఉత్తరం నాలో ఒక్కొక్క రకమయిన మార్పు తీసుకు వస్తుంది. ఒకసారి రాశాడు: 'సర్వజన శ్రేయానికి సోపాన

మయిన ప్రజాస్వాతంత్ర్యం కోసం ఈ కటిక నేలమీద పడుకుని, యినుప వూచల వెనక యమయాతన అనుభ విస్తూవుంటేగా, నువ్వు కులుకుతూ సొగసు మిఠాగిలా మెత్తటి దూది పరుపులమీద ఎలా శయనించ గలుగుతున్నావ్! నీది గుండా, రాయా? పురుషజాతి దౌష్ట్యంలో అణిగి పోతున్న నీ స్త్రీజాతి ఆక్రందనా, దాస్యశృంఖలాలలో బందీ కృతమైవున్న భారతజనని నిరంతర ఘోషా ధనిక, వర్గాల దౌర్జన్యంలో మగ్గిపోతూవున్న కార్మిక కర్షక సముదాయం చేస్తున్న దీనాలాపమూ నీకు వినిపించడంలేదూ?' ఆ ఉత్తరం నాలో తీసుకువచ్చిన సంచలనం అంతా యింతా కాదు. ఆరునెలలు నాగదిలో నేను ఒక్కతెనూ కటికనేల మీద పడుకున్నాను. రెండు సంవత్సరాలు నా భర్తకి దూరంగా మసిలాను. కాని, ఈ చిన్ని చిన్ని త్యాగాలు శంకరం చేస్తున్న త్యాగంలో ఎన్నోవంతు? నా ప్రేమ కోసం అతను వివాహాన్ని త్యజించాడు దేశంకోసం బంధు వుల్నీ, ఆస్తినీ, స్నేహితుల్నీ త్యజించాడు. తను పడుతున్న బాధ అంతా నిష్ప్రయోజన మయినదని ఏ ప్రాచ్య వేదాంతో అతనికి నచ్చజెప్పితే, ఏ వింధ్యారణ్య ప్రాంతా లకో, ఏ పాపికొండలకో, ఏ హిమాలయ ప్రదేశాలకో— నాకింక ఈ జీవితంలో కనిపించకుండా పారిపోతాడేమో అని భయంవేస్తోంది.

చదవమన్నట్లుగా భానుమతి ఉత్తరం అరవింద చేతికి యిస్తుంది.

"భానూ, నేను జైలునుంచి వచ్చి ఇరవై రోజు లైంది. ఈసారి ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. గుండెలలో నొప్పి, డొక్కలో నొప్పి ఆరంభమయినై. మందు పుచ్చు కుంటున్నాను.

జబ్బు తగ్గుతుందనీ, ఆరోగ్యం కుదుట బడుతుందనీ డాక్టరు చెప్తున్నాడు. కాని, బతకాలనే యిచ్ఛ నాలో చచ్చిపోతోంది.

ఈమధ్య కొన్ని రోజులనుంచీ నిన్ను గురించిన మధుర స్వప్నాలే నన్ను అనుక్షణమూ బాధ పెడుతున్నాయి. నిర్మాణకార్యక్రమ సందర్భంలో మనవూరు వెళ్ళినప్పుడు, ఏ చెట్టునీడని మన ఆఖరు సంభాషణ జరిగిందో, ఆ దానిమ్మ చెట్టుకోసం వెతికాను. కనిపించలేదు. కాలవాహినిలో కలిసి పోయిందనుకుంటాను.

ఈవేడు అమ్మాయి స్కూలుఫైనలు పరీక్షకి వెళ్తోందని తెలుసుకుని, చాలా సంతోషించాను. మనం చేసిన తప్పులే మన పిల్లలుకూడా చెయ్యకుండా వుండేటట్లు చూడవలసిన బాధ్యత మన మీద వుంది.

పద్ధెనిమిదేళ్ళు గడిచిపోయిన తర్వాత ప్రణయ బీజాలు అకారణంగా వాటంతటవే మొలిచి నన్ను నిష్కారణంగా వ్యాకులపరచడం చాలా వింతగావుంది. ఒక్కొక్కప్పుడు తారని తీసుకుపోయిన శశాంకుడూ, సీతని ఎత్తుకుపోయిన

రావణుడూ, రుక్మిణిని దొంగిలించిన కృష్ణుడూ జ్ఞాపకం వస్తారు. అలాగే నిన్ను కూడా—నువ్వు ఏ లెక్చర్ యిస్తున్నప్పుడో, ఏ క్లబ్బుకి వెళ్తున్నప్పుడో—అమాంతం ఎత్తుకు పారిపోవా లనిపిస్తుంది. ఉత్తరక్షణంలో సంఘమూ సాంప్రదాయమూ, న్యాయమూ, ధర్మమూ 'నీకు మతిభ్రమత కలగడం లేదుకదా ?' అని అడుగుతాయి.

ఒక్కొక్క రోజున వెన్నెలలో కూచుని దానిలో కరిగి పోతే బావుంటుందని భ్రమిస్తాను. ఇంకొక్క రోజున చల్లదనమూ, చంద్రుడిశోభా, ప్రకృతిలోని సౌందర్యావస్థా రేకెత్తించే కోర్కెలతో మండే ఈ మస్తిష్కం ఫెడేల్ మంటూ పగిలిపోతే హాయిగా వుంటుందని అనుకుంటాను.

జీవితంలో ఫలవంతమయిన కాలమంతా గడిచిపోయింది. యవ్వనమంతా గడిచిపోయింది; వ్యూహానిర్మితమయిన ఆశాసౌధం మాత్రమే మబ్బుల్లో కనిపిస్తోంది. 'దేశ స్వాతంత్ర్యానికి ఆహుతి అయిపోయిన యువకులలో నేను కూడా ఒకణ్ణి' అనే సంతృప్తి తప్ప ఈ జీవితం మరిం కేట్టి సంతోషాన్నీ నా కివ్వలేక పోయింది.

నువ్వు వచ్చి ఈ కుటీరాన్ని శోభామయంగానూ, నా హృదయాన్ని ప్రేమమయంగానూ చేస్తావనే ఆశాకిరణం దృష్టికి అగోచరంగా వుంది. కల తెల్లారిపోతోంది.

ఇంకా ఎందుకు నేనీ ప్రేమోన్మాదానికి బానిసనై వుంటున్నానో తెలుసుకోలేని అసహాయ స్థితిలో వున్నాను. వీలు వుంటే ఒక్కమారు వచ్చి నన్ను చూసి పో.''

నీ

శంకరం.

అరవింద ఉత్తరం మూసి భానుమతి వంక చూస్తుంది. భానుమతి ముఖం వివర్ణమై వుంటుంది. కళ్ళల్లో అర్థం లేదు. కంటిలో నీరు లేదు.

భానుమతి—అరవిందా, యిక నేను వెళ్తాను. 'నన్ను చూసి పో', అని రాశాడు. పోను. ఇంక యిక్కడికి రాను. అక్కడే వుండిపోతాను.

అరవింద—తొందరపడకండి. సావధానంగా ఆలోచించి నిశ్చయానికి రండి.

భానుమతి—పద్ధెనిమిదేళ్లు ఆలోచించాను. ఇంకా ఆలోచించాలీ?

చంద్రశేఖరం ప్రవేశం, వయస్సు నలభై. ఫుల్ సూటులో వుంటాడు. హాట్ చేతిలో వుచ్చుకుని, "గుడ్ మార్నింగ్ మిస్ అరవిందా!" అంటాడు.

అరవింద—వెరీ గుడ్ మార్నింగ్.

చంద్రశేఖరం—భానూ, సాయంత్రం అయిదింటికి రామారావుగారింట్లో టీపార్టీవుంది. ఆహ్వానం వచ్చిందా?...... ఇవ్వాళ నీచేత వీణపాడించి తీరుతారు. మిసెస్ రామారావు 'యివ్వాళ భానుమతిచేత ఎలాగో అలా పాడించి తీరుతాను' అని పట్టుపట్టింది.

అరవింద భానుమతి మొహంలోకి చూస్తుంది. భానుమతికి ఈ పలుకులు వినిపిస్తున్నట్లు తోచదు.

భానూ, తప్పను. సిద్ధంగా వుండాలి. మధ్యాహ్నం కొద్దిగా సాధన చెయ్యి.

భానుమతి—నేను వెళ్ళిపోతున్నాను.

అరవింద నాలుక కరుచుకుంటుంది. చంద్రశేఖరానికి అర్థంకాదు.

చంద్రశేఖరం—ఏమిటి ?



భానుమతి—నేను వెళ్ళిపోతున్నాను.

చంద్రశేఖరం—ఎక్కడికి ?



భానుమతి—చెప్పను.



చంద్రశేఖరం—కవిత్వమా ? (వెకిలిగా నవ్వుకుంటూ లోపలికి పోతాడు.)

అరవింద—మీరు తొందర పడుతున్నా రేమో ! మీకు శంకరం మీద అమోఘమయిన ప్రేమ వుండవచ్చు. కాని, అందుకోసం సంఘం యిస్తున్న ఆదరణా, మర్యాదా, ఆశ్రయమూ చేతులారా ఎందుకు పోగొట్టు కుంటున్నారో నాకు అవగాహన మవడం లేదు. దూరాలోచన లేకుండా చేసిన పని అని తర్వాత పశ్చాత్తాప పడతారేమో ! సులువుబలువులు ముందే యోచించండి.

భానుమతి—శంకరాన్ని చూడకుండా, శంకరానికి నా దగ్గిర్నుంచి ఏం కావాలో యివ్వకుండా ఒక్క క్షణం వోపిక పట్టలేను. నామనస్సు గుర్రంలా పరిగెత్తుతోంది. శంకరం దగ్గిర ఎలాగో అలా తక్షణం వాలాలి.

అరవింద—మీ ప్రణయోన్మాదం నాకు అర్థ మవుతోంది. స్వేచ్ఛకోసం తిరుగుబాటు చేసిన విప్లవ శక్తుల్ని మీరు పద్దెనిమిదేళ్ళ దౌర్జన్యంతో అణిచిపెట్టారు. తిరుగుబాటు శక్తులు విజృంభించి దౌర్జన్యపిశాచాన్ని కబళించేశాయి. స్వాతంత్ర్యదేవత నృత్యగీతాలు సలుపుతోంది. ఆ జయ జయధ్వానాలు మంగళప్రదమయినవి. మీరు ఖంగారు పడకండి. ఒక కొత్త వెలుగును మీరు చూడబోతున్నారు. ఒక కొత్తకాంతి మీ ఆలోచనలకి జీవం పోస్తుంది. నేను చెప్పేది మీకు కంటకంగా తోచవచ్చు; కాని, నేను మీ శ్రేయస్సుని లక్ష్యంగా చేసుకుని చెప్తున్నానని నమ్మండి. సంఘం ఒక పెద్ద నవల; యుక్తి తెలిసిన చేపలెన్నో చక్కగా తప్పించుకుని స్వేచ్ఛా విహారాలు సలుపుతున్నాయి. మీరు పదిహేనేళ్ళనుంచి విడాకులగురించి సంఘంతో పోట్లాడుతున్నారు. దాని అవసరాలూ, ఆవశ్యకతా, లాభాలూ మీరు ఎన్నోసార్లు సమాజానికి నచ్చచెప్పారు. సమాజం ఏమంది, ఏంచేసింది? మీరు చెప్పిన రిఫార్మ్సుకి చప్పట్లు కొట్టింది; జోక్సుకి నవ్వింది; విషయానికి 'చూదాం లే!' అన్న ధోరణిలో వూరుకుంది. సమాజం మిమ్మల్ని ఎలా జోకొట్టిందో, మీరూ సమాజాన్ని అలాగే జోకొట్టి, బుజ్జగించండి. కుక్క కాటుకు చెప్పుదెబ్బ. మీ ఆత్మే మీకు సాక్షి.

భానుమతి—మీరు చాలా ప్రమాదకరమయిన పద్ధతి చెప్తున్నారు. అది నా అశాంతిని వృద్ధి చేస్తుంది.

అరవింద—చెయ్యదని నా విశ్వాసం. ప్రయత్నలోపం మాత్రం చెయ్యకండి.

నౌకరు ఒక టెలిగ్రాం తీసుకువచ్చి అమ్మగారికి యిస్తాడు. "ఎక్కణ్ణుంచి?" అంటూ ఆతురతతో చింపుతుంది భానుమతి. అరవింద టెలిగ్రాం భానుమతి చేతిలో నుంచి లాక్కొని అప్రయత్నంగా "Shanker Died-Dr. Sundaresan." అని చదువుతుంది.

భానుమతి—(విహ్వలంగా) శంకరా...(కళ్ళల్లో వెర్రి చూపు కనిపిస్తుంది. నుంచుంటుంది. అరవిందకూడా నుంచుని, తుపానుగాలికి అల్లలలాడే చెట్టులా కదులుతున్న భానుమతి రెండు భుజాలూ పట్టుకుంటుంది.)

దే....వు....డా!!!! సగం నుంచున్న భానుమతి కనుకొలకుల్లో నుంచి నీటి ముత్యాలు రాలుతూ వుండగా, మొదలు తెగిన అరటిచెట్టులా కింద పడిపోతుంది.

(తెర)

# తండ్రి

హాలుకి మధ్యగా ఒక చిన్న టేబిల్. దానిమీద ఒక ఫ్లవర్ వేస్. ఆ వేస్‌లో ఉన్న గులాబీపూలగుత్తి టేబిల్‌కి శోభని సమకూరుస్తూ వుంటుంది టేబిల్‌కి నాలుగు వైపులా రోజువుడ్ కుర్చీలు.

హాలులో కుడిచేతి వైపునా ఎడంచేతి వైపునా రెండు సోఫాలు, సోఫాలకి చెరోపక్కనా ఒక్కొక్క కుర్చీ. హాలులో ప్రవేశించగానే ఎదురుగా కనిపించే గోడకి ఒక పెద్ద ఎలక్ట్రిక్ గడియారం. ఆ గడియారానికి యిరుపక్కలా రెండు అందమయిన ఫొటోలు: ఒకటి జవహర్‌లాల్ పండితునిది, రెండు అజంతా సుందరిది. హాలుకి ఎడంచేతి వైపున, మూలగా, గృహాంతర్భాగం లోకి పోయేందుకు ఒక ద్వారం. ద్వారానికి ఒక కర్టెన్. ద్వారబంధానికి ఒక కాలింగ్ బెల్.

హాలు చూసీ చూడగానే ఒక సామాన్య కుటుంబీకుని యిల్లు వలె పొడగట్టదు. సామాన్యకుటుంబంలోనే పుట్టి, ధనం ఆర్జించి, నిలవచేసి, గొప్పవాడైపోయిన వాని సౌధము వలె కన్పట్టుతుంది.

సుందరమ్మ: వృద్ధాప్యం అంగలు వేసుకుంటూ వస్తూ వున్నా తనకింకా వయస్సు మళ్ళలేదని లోకానికి రుజువు చేదామనే ఆపోహతో పవుడర్లరాస్తూ స్నోలరాస్తూ, తన అందాన్ని నిలబెట్టుకో గలుగుతున్నానని భ్రమించే మనిషి. ఉప్పాడచీరె, పట్టు రవిక ఆమె దుస్తులు. కాళ్ళకి సాండల్స్. మెడలో మూడు పేటల గొలుసూ, చేతులకి మూడు జతల గాజులూ ఆమె ఆభరణాలు. కళ్ళకి కళ్ళజోడు. వయస్సు నలభై ఎనిమిది.

నరసింహారావు: అయిదు దశలు గడిచిపోయి, ఎనిమిది సంవత్సరాలు పైబడ్డా, తలంతా ముగ్గు బుట్టలా అయిపోయినా, మీసాలకి రంగు మాత్రం మానడు. గ్లాస్గో మల్లు పంచె, సిల్కు లాల్చీ ధరిస్తాడు. కాళ్ళకి రబ్బరు స్లిప్పర్లూ కళ్ళకి కళ్ళద్దాలూ తప్పవు కదా !

కుడిచేతి వైపునవున్న సోఫాలో ఒక చివరగా సుందరమ్మా, ఇంకో చివరగా నరసింహారావూ కూచుని ఉంటారు, అల్లిక కుట్లు కుడుతూ, ముక్కుమీదనుంచి జారిపోయే కళ్ళజోడు పైకి సర్దుకుంటూ వుంటుంది సుందరమ్మ. న్యూస్‌పేపరు చదువుకుంటూ వుంటాడు నరసింహారావు.

టైము : ఉదయం పది గంటలు.

నర——(పేపరు వళ్ళో పెట్టుకొని) ఇదిగో............

సుందరమ్మ ఏమీ మాట్లాడదు. కుట్లధోరణిలో ఉంటుంది.

నర——ఏమేవ్.............విన్నావూ.........

సుంద——అబ్బ! అదేమిటండీ, ఎన్ని ఏళ్ళు వచ్చినా ఎంత సంఘ సంస్కారుల మైపోయినా మీకీ దురభ్యాసం పోలేదు. సుందరీ అని పిలవకూడదూ నన్ను?

నర——(నవ్వుతాడు) సుందరీ!

సుంద——ఊఁ.....ఎందుకూ?

నర——నిన్ను పేరు పెట్టి పిలుద్దా మనుకుంటూనే ఉంటాను. కాని, అప్పు డప్పుడు మళ్ళీ పొరబడుతూ వుంటాను. నువ్వు ఆగ్రహోదయత్త చిత్తవై పోతూవుంటావ్!

సుంద——(విసుగు తోచిన దాని వలె) అసలు విషయమేమిటి?

నర——మొన్న మాధవపురంలో మహిళామణుల కాన్ఫరెన్సు అయింది. నువ్వు వెళ్ళలేదేం?

సుంద——(నిగూఢమైన భావంతో) నేను ఊళ్ళో ఉంటేనే యిలా నడుస్తోంది. నేను ఏదయినా ఊరు వెళ్ళానా

అంటే, యిక చెప్పనే అక్కర్లేదు. ఊళ్ళో ఉన్నప్పుడే నా కళ్ళల్లో కారం కొడుతోంది. ఊళ్ళో లేకపోతే యిక విచ్చలవిడే! నిష్కారణం నలుగురు నోళ్ళల్లోనూ పడతాము!

నర—మన అమ్మాయి అలా పొరపాటుగా ఎప్పుడూ ప్రవర్తించదు.

సుంద—ఆ వేడిరక్తం అలాటి ప్రవర్తనకి ప్రేరేపిస్తుంది.

నర—మన అమ్మాయిని మనమే అనుమానిస్తే, లోకులు ఎంత తేలికగా చూస్తారో ఆలోచించు.

సుంద—అనుమానించడమేమిటి, నా మొహం, రాత్రి ఒంటిగంటకి యింటికి వచ్చింది.

నర—అబ్బాయి కూడా ఉన్నాడు కాదుటే,—దాంతోను?

సుంద—ఉన్నాడు,—ఏడవను! వాడి గొడవ వాడిది, దానిగొడవ దానిది.

నర—ఆడవాళ్ళు వట్టి అనుమానపు పీనుగులు.

సుంద—మొగవాళ్ళు కారు కాబోలు. అబ్బాయికి కావేరిని చూస్తే చింపి చేటంత మొహం అవుతుంది. అమ్మాయి బారిస్టర్‌గారి శేఖరాన్ని చూసి గుర్రాల మీద పరిగెడుతుంది. ఇద్దరూ అదుపూ, ఆజ్ఞా లేక చెడిపోతూ వుంటే, అసమర్థులై మీ రిక్కడ పేపరు చదువుకుంటూ కూచున్నారు.

నర—(ధీమాంతో) అసమర్థతా! అసమర్థతా! డిప్టీకలెక్టరీచేసి, పెన్షన్ పుచ్చుకుంటున్న ఈ ఆఫీసరుకి అసమర్థతా??

నరసింహారావు మీసాల మీద ఒక చెయ్యి వేసుకొని, మరిచిపోయిన ప్రేమ నాటకాలని జ్ఞప్తికి తెస్తున్నాడా అన్నట్టుగా రెండో చేతితో సుందరమ్మ వీపు మీద చరుస్తాడు. సుందరమ్మ ఎగతాళిగా నవ్వుతుంది.

నర—వాళ్ళ బాగోగులు నిర్ణయించుకోగల జ్ఞానం వాళ్ళకి యిప్పటినుంచీ ఏర్పడాలి.

సుంద—ఏదేమి వున్నా, ముందు వాళ్ళు చెడిపోతున్నారు.

నర—ఏమీ చెడిపోరు.

సుంద—చెడిపోతారు.

నర—అంత చెడిపోయేవాళ్ళు ఎప్పుడయినా చెడిపోతారు. మనమేం చెయ్యగలం?

సుంద—ఏం చెయ్యగలమేమిటి? ఏం చెయ్యలేం? మన సంతానానికి మనమే బుద్ధి గరపలేకపోతే ఎట్లా? మీరు ఘట్టిగా శిక్షిస్తేసరి, అమ్మాయిని మందలించండి. అబ్బాయికి మా అన్నయ్య కూతుర్ని యిచ్చి పెళ్ళి చెయ్యండి. ఇప్పుడు వాడికి పెళ్ళి చెయ్యక పోయారా, వాడా కిరస్తానీముండని పెళ్ళాడుతాడు.

నర—ఆ కిరస్తానీ పిల్ల పేరేమిటి చెప్పావ్? కావేరి—ఆ అమ్మాయి కంటె మీ అన్నయ్య కూతురు ఘనత ఏమిటి?

సుంద—అదీ, మా అన్నయ్య కూతురూ సమానమే నంటారూ ??

నర—బంధుత్వరీత్యా, నీకూ, నాకూ సమానం కాక పోవచ్చు. కాని అబ్బాయి దృష్టిలో కావేరే మీఅన్నయ్య కూతురుకంటె.........

సుంద—(కొద్ది కోపంతో) అబ్బాయి దృష్టి! చెడిపోయే దృష్టి! సర్వనాశనకరమయిన దృష్టి! పతనహేతువయిన దృష్టి! మీమూలానే వాళ్ళు అలా పాడైపోతున్నారు.

నర—నీకు ఆత్మ సంస్కారం లేదు.

సుంద—మీకు ఉంది కనకనే కాబోలు అమ్మాయి రాత్రి ఒంటిగంటకి వచ్చినా ఏమీ మాట్లాడరు.

నర—స్వేచ్ఛ ప్రతి జీవికీ అవసరం. ఆ స్వేచ్ఛని దుర్వినియోగం చేసేవారు పతితులై పోతారు. అమ్మాయి తన స్వేచ్ఛని దుర్వినియోగం చేసేటంత అవివేకి కాదని నా దృఢ నిశ్చయం.

సుంద—అమ్మాయి దగ్గిర ఘట్టిగా మాట్లాడేందుకు నాకు ధైర్యం చాలదు. కోప్పడితే ఏడుస్తుంది. అది ఏడిస్తే నా హృదయం తరుక్కు పోతుంది. ఊరుకోనేందుకు మనస్సు ఒప్పదు. ఏదయినా అవాంతరం జరిగిందా అంటే నలుగురు లోనూ తలెత్తుకు తిరగలేం!

నరసింహారావు గడ్డం కింద చెయ్యిపెట్టుకు యోచిస్తాడు.

నర—సుందరీ! నిజంగా నీకు మన మంజరీ, వాళ్ళ శేఖరమూ, విషయంలో అనుమానం ఉందా?

సుంద—ఆ అనుమానం కంటె మీ అనుమానం ఎక్కువగా ఉంది. గత లక్ష్మివారం రాత్రి మీరు క్లబ్బునుంచి రాత్రి పదకొండు గంటలవాకా యింటికి రాలేదు—జ్ఞాపకం ఉందా? ఆ రోజున నేను ఏడున్నరకే లేడీస్ క్లబ్బునుంచి వచ్చేసాను. మంజరి గదిలో మంజరీ, శేఖరమూ కారమ్స్ ఆడుకుంటున్నారు. మన అమ్మాయిని చూసేటప్పటికి నాకెందుకో అనుమానం తగిలింది. వంటమనిషి చెప్పిన విషయాన్ని బట్టి నా అనుమానం నిరాధారమైనది కాదని నమ్మవలసి వచ్చింది. అతను వెళ్ళిపోయిన తర్వాత మంజరిని నిలవదీసి అడిగాను. చెడామడా తిట్టాను. 'నీ మూలాన వంశానికి అప్రతిష్ట' అన్నాను 'మహిళాలోకానికే అపఖ్యాతి' అన్నాను. నానా మాటలూ అన్నాను. చివరికి అమ్మాయి వప్పుకొంది.

నరసింహారావు నిశ్చేష్టుడై గడ్డంకిందవున్న చెయ్యి తీసి, తెల్లబోతూ సుందరమ్మ వంక చూస్తాడు.

నర—వ...ప్పు...కొం...దీ...

సుంద—ఊఁ. నా తిట్లకి మంచం మీద పడుకొని భోరున ఏడ్చింది. ఆమె కంటినుంచి ఒక్కొక్క కన్నీటిబొట్టు పడుతూ వుంటే, నా రక్తంలోనుంచి ఒక్కొక్క రక్తపు బొట్టు పోతున్నట్లు బాధపడ్డాను. ఇంటర్ ఫస్టు క్లాసులో పాసయిన

మన మంజరి నా దగ్గిర అంత బేలతనంగా ఏడవడం నాకే జాలేసింది.

నర—మంజరి యింత పని చేసిందా, తర్వాత ?

సుంద—తర్వాత ఏమిటియింక ? దుర్భ్యాసాలకి అల వాటే పడకూడదు కాని అలవాటు పడిన తర్వాత తప్పించడం అసాధ్యమయిన పని. లక్ష్మీవారం అలా జరిగిందా, శుక్రవారం, శనివారం మంజరి వీధిలోకే వెళ్ళలేదు. ఆదివారం అన్నగారితో కూడా ఏదో మాటనికి వెళ్ళి ఏడయ్యేటప్పటికి యింటికి వచ్చింది. సోమవారం నుంచి మళ్ళీ మామూలే ! నిన్నరాత్రి ఒంటిగంటకి యింటికి వచ్చింది. డ్రైవరు ఉండగా నిశిరాత్రి వేళ తను కారు నడుపుకుంటూ రావడం, అదేం ఖర్మమో !

నర—(తెల్లబోతూ) ఇప్పుడు యింట్లో ఉందా ?

సుంద—రాత్రి మూడుగంటలదాకా ఏమిటో చదువుకుంటూ కూచుంది, ఇంకా నిద్రపోంచి లేచిందో లేదో !

సోఫాలో కూచున్న సుందరమ్మ లేచి, ఎడం వైపున ఉన్న ద్వారం దగ్గిరికి వెళ్ళి కాలింగ్ బెల్ రెండు సార్లు నొక్కి, తిరిగి వచ్చి, సోఫా పక్కని ఉన్న కుర్చీలో చతికెల బడుతుంది.

నర—శంకరం యింట్లో ఉన్నాడా ?

సుంద—వాడు ఉదయాన్నే ఎక్కడికో వెళ్ళినట్టున్నాడు.

వంట మనిషి ప్రవేశిస్తాడు. పిలక బ్రాహ్మడు. ఉత్తరీయానికి బదులు ఒక గావంచా. ధోవతికి బదులు మరొక గావంచా ధరిస్తాడు.

వంట—బాబూ, వంట ఇంకో పది నిముషాలలో అయిపోతుంది.

నర—(తీవ్రంగా) అమ్మాయిగారు నిద్రనుంచి లేచిందా?

వంట—అప్పుడే గంట అవవస్తోంది—వారు నిద్రనుంచి లేచి—స్నానంచేసి, బట్టలుకూడా వేసుకొన్నారు. ఇప్పుడే వారికి కాఫీ యిచ్చాను. మధ్యాహ్నం ఎవరో స్నేహితు లింట్లో విందట! అంచేత, భోజనానికి రానని చెప్పారు.

సుందరమ్మ, నరసింహారావు ఒకరి వంక యింకోరు చూసుకుంటారు. సుంద రమ్మ చిరునవ్వు నవ్వుతుంది. నరసింహారావు దిగాలుపడి చూస్తూవుంటాడు.

నర—(వంటమనిషితో) నువ్వు పో.

వంట—చిత్తం.

వంట మనిషి నిష్క్రమిస్తాడు.

నర—నిన్న రాత్రి ఎక్కడికి వెళ్ళిందో మంజరిని అడిగావా?

సుంద—అడిగేదేమిటి! శేఖరమూ, అదీ కలిసి ఏదో సినీమాకి వెళ్ళిఉంటారు.

నర—మంజరికి శేఖరాన్ని పెళ్ళి చేసుకోవాలని అభిలాషగా ఉందేమో!

సుంద—మన అమ్మాయిని ఎవరో ఐ. సి. యస్. చేసుకుంటానన్నాడు కాదూ! అలాటి వాడికివ్వాలి గాని బి. ఎ. పాసయిన శేఖరానికేమిటి!

నర—అలా కాదులే యింకా, నీకు తెలీదు. "నాకు ఐ. సి. యస్. వద్దు; ఐ. యమ్. యస్. వద్దు; శేఖరమే

కావాలి—అతన్నే పెండ్లి చేసుకుంటాను''అని అమ్మాయి మొండిపట్టు పడితే మనం చేసే దేమీ లేదు. అంచేత మంజరి అభిప్రాయానికి అనుగుణంగా నడవడమే మన కర్తవ్యం.

శంకరం ప్రవేశిస్తాడు. కాళ్ళకి తెల్లటి కాన్వాస్ షూస్ ఉంటాయి, తెల్లటి పంట్లామూ, చారల సిల్కుషర్టూ ధరిస్తాడు. ఒక చేతిలో టెన్నిస్ రాకెట్టూ యింకో చేతిలో జేబురుమాలూ. వయస్సు యిరవైమూడు.

శంక—అమ్మా, మంజరి యింట్లో ఉందా ?

సుంద—ఏమిటీ హడావిడి ?

శంక—ఇవాళ మిస్. కావేరి ఫాదర్ విందు చేస్తున్నారు. మంజరిని ఆహ్వానించారు.

సుంద—విందు ఎందుకు ?

శంక—అదేమిటమ్మా ! విందు ఎందుకేమిటి ? విందు చెయ్యడానికి ఒక కారణం ఉండాలా? సరదాకి చేస్తున్నాడు.

నర—నువ్వూ వెళ్తావా ?

శంక—ఊఁ.

సుంద—చెల్లెల్ని ఆదర్శ స్త్రీ రత్నంగా చేద్దామనేనా నువ్వామె చేత యిలాంటి పనులు చేయిస్తున్నావ్ ?

శంక—అంత పెద్దమాటలు నాకు తెలియవు. మంజరీ, కావేరీ క్లాస్ మేట్సు. కావేరి మంజరిని ఆహ్వానిస్తూ సగౌర

వంగా నన్నుకూడా రమ్మంది. అంచేత యిద్దరమూ వెళ్లాం. వెళ్ళకపోతే, వారు ఫీలవుతారు.

సుంద—ముఖ్యంగా—కావేరి కాదు నాయనా ?

శంక—అవును కావేరికి నామీద కోపం వస్తుంది.

శంకరం తొందరతొందరగా ఎడంవైపున ఉన్న ద్వారబంధపు కర్టెన్ తొలగించి, లోనికి దూరతాడు.

నరసింహారావు, సుందరమ్మ ఒకరి వంక యింకోరు ఆశ్చర్యార్థకంగా చూసుకుంటారు.

సుంద—చూశారూ ?

నర—అవుతే వీడు కావేరిని పెళ్ళి చేసుకుంటా డన్న మాట.

సుంద—ఇదేమిటండోయ్, యిలా మాట్లాడుతున్నారు. శేఖరం విషయం చెప్తే శేఖరానికీ మంజరికీ పెళ్ళి అంటున్నారు. కావేరి విషయం చెప్తే కావేరికీ శంకరానికీ పెళ్ళి అంటే అంత తేలికగా ఉందా ? మంచీ చెడ్డా ఎంతో ఆలోచించాలి. అసలు మీరంటే భయమూ భక్తీ లేకపోవడం చేతనే వీళ్ళిద్దరూ యిలా తయారయారు. లేకపోతే............

నర—లాభం లేదు. వాడు కావేరిని వివాహ మాడుతాడు. ఇది శేఖరాన్ని తప్ప అన్యుల్ని వరించనంటుంది.

సుంద—అలా కుదరదు. మంజరి శేఖరాన్ని చేసు కొన్నా, శంకరానికి మా అన్నగారి కూతుర్ని యిచ్చి చెయ్యవలసిందే !

నర—ఏమిటో మూర్ఖత ? శంకరం వప్పుకుంటేనా ?

సుంద—మీరు ఘట్టిగా చెప్పరు. చెప్తే మీ మాటకి తిరుగు ఉంటుందా ?

నర—చెప్పితే ప్రయోజన మేమిటి,- వినడని పూర్తిగా తెలిసి నపుడు......అయినా వాడి ఉద్దేశం ఏమిటో కను క్కుందాం ?

నరసింహారావు నిష్క్రమించేందుకూ, మంజరి ప్రవేశించేందుకూ మధ్య మూడు నిముషాలు గడుస్తుంది. ఈ లోపల సుందరమ్మ అల్లికపట్లు కుట్టుకుంటూ కూచుంటుంది.

మంజరి పద్దెనిమిదిఏళ్ళ యువతి. రూపసి. ఆకర్షించే అంగసౌష్టవం ఆమెకి పెట్టని సొమ్ము. చాక్లెట్ రంగు సిల్కుచీరె, రోజా కలర్ జాకెట్ ధరిస్తుంది. జడకి వెనకాల షోకుగా వేసుకొన్న రిబ్బను గాలికి రెపరెప లాడుతూ వుంటుంది చేతిలో హాండ్ బాగ్, సిల్కు జేబురుమాలు, కాళ్ళకి లేడీస్ షూజ్, రెండు జతల గాజులూ, రిస్టు వాచీ, మెళ్ళో రెండుపేటల బంగారపు గొలుసూ—ఆమె ఆభర ణాలు.

సుంద—మంజరీ యిలా కూచో.

ఎంతో నమ్రతతో తల్లి పక్క సోఫాలో కూచుంటుంది.

మంజరి—ఏం ?

సుంద—ఎక్కడికమ్మా ప్రయాణం ?

మంజరి—మా స్నేహితు లింట్లో విందు జరుగుతోంది; నన్నూ, అన్నయ్యనీ పిలిచారు. వెళ్తున్నాం.

సుంద— శేఖరాన్ని కూడా పిలిచారా ?

మంజరి—(సిగ్గుపడి) ఏమో !

సుంద—మంజరీ, నువ్వు మనస్సు మార్చుకోవాలి.

మంజరి మాట్లాడలేక, గుప్పు వప్పజెప్పి, తల్లి వంక ఎంతో బిక్కగా చూస్తుంది.

సుంద— మొన్న లక్ష్మివారం నాతో ఏం చెప్పావ్ ?

మంజరి—చెప్పాను...కాని, శేఖరాన్ని చూడకుండా నేను ఒక్క రోజయినా ఉండలేను.

సుంద—శుభ్రంగా చదువుకోక మనస్సు వెర్రి తోవల పోనిస్తా వెందుకమ్మా ?

మంజరి—నేను శేఖరాన్ని ప్రేమిస్తున్నాను. అతన్ని...

సుంద—పెళ్ళి చేసుకుంటావా ?

సిగ్గువల్ల మంజరి మాట్లాడలేక పోతుంది. వీధిలోని కారుహారన్ వినిపిస్తుంది.

మంజరి—(ఉత్సాహావేశాలతో)అతను వచ్చినట్లున్నాడు.

సుంద—వెర్రినిపడుతున్నావు తల్లీ.

మంజరి మళ్ళీ సిగ్గుపడుతుంది. సోఫాలో నుంచి లేస్తుంది.

మంజ—అమ్మా ! వెళ్తాను.

సుంద—మళ్ళీ యెన్ని గంటలకి వస్తావు ?

మంజ—మధ్యాహ్నం టీ వేళకి. అతన్ని కూడా తీసుకు వస్తాను.

మంజరి నిష్క్రమిస్తుంది.

వెళ్తూ, మంజరి తల్లి వంక అతి దీనంగా చూస్తుంది. సుందరమ్మ కళ్ళ వెంబడి క్షోభతో కూడిన ఆనందాశ్రువులు రాల్తాయి.

సుందరమ్మ విచారిస్తూవుండగా, లోపల్నుంచి శంకరమూ, నరసింహారావూ ప్రవేశిస్తారు. శంకరం డ్రెస్ పూర్తిగా మార్చేస్తాడు. బెంగాలీబాబు ఫక్కీలో ఉంటాడు.

నర—మంజరి శేఖరాన్ని పెళ్ళిచేసుకోవాలని ప్రయత్నం చేస్తోందన్న మాట.

శంక—అవును.

నర—నువ్వు కావేరినా ?

శంకరం నరసింహారావు వంక 'ఏమిటీ ప్రశ్న' అన్నట్లు చూస్తాడు.

శంక—అమ్మా! మంజరి ఏది ?

సుంద—శేఖరం కారుహారన్ వినిపించి వీధిలోకి వెళ్ళింది. ఇంకా కాంపవుండ్ దాటి ఉండదు వాళ్ళకారు.

శంకరం తొందరగా పరిగెడతాడు. నరసింహారావు సోఫాలో కూలబడతాడు.

సుంద—చూడండి. ఎలాటి కుటుంబానికి ఎంత దౌర్భాగ్యదశ పట్టిందో అమ్మాయి నాయిళ్ళ పిల్లవాడినీ అబ్బాయి కిరస్తానీ పిల్లనీ వివాహమాడడమూ! ఘోరం, ఇదేం సంస్కారమండీ ? మితిమీరిపోతోంది.

నర—ఏమీ మితి మీరడంలేదు. వాళ్ళు వరి, కోరి, ప్రేమించి, పెళ్ళి చేసుకుంటున్నారు; ఏమీ చింతపడవలసిన

అవసరం లేదు. కులాలూ, కులమర్యాదలూ, ధనవంతుడికి బంధువులు యిచ్చే ఆదరణా వాళ్ళని భ్రమపెట్టవ్! వారిని ఉదార హృదయాలు. వారి ఔదార్యాన్నీ, వారి అంతరంగిక ప్రేమనీ, వారి పవిత్రప్రణయాన్నీ, వారి సున్నిత మహాభావాలనీ అవగాహన చేసుకొనేందుకు కొంత సంస్కారం అవసరం. ఆ సంస్కారం ఉన్నవాళ్ళకి వాళ్ళు ఉత్తములుగానూ, లేనివాళ్ళకి కులభ్రష్టులుగానూ కనిపిస్తారు. అంచేత, ఆ దృష్టిదోషమూ, ఆ నిర్ణయమూ లోకులలో ఉంది కాని వారిలో లేదు. ఐ. సి. యస్. ని తృణీకరించి తను ప్రేమించిన శేఖరానికే భార్య అవాలని అభిలషించడంలో మంజరి గాంభీర్యత, మూప్ఫయివేల రూపాయిలతో వస్తూవున్న మీ అన్నగారి కూతుర్ని కాదని, కావేరిని కోరడంలో శంకరం ఉదారత జనసామాన్యానికి బోధపడక పోవచ్చు.

సుంద—నాకు తెలుసు కాదూ, మీరు యిలా త్రాళం వేస్తారని! మీ మూలానే పిల్లలు పాడై పోయారు.

నర—అలాగా ?

సుంద—ఈనాడు కులభ్రష్టులై పోవడానికి సిద్ధంగా ఉన్నారు.

నర—(నవ్వుతూ) అవనీ!

సుంద—(కోపంగా) వాళ్ళు కులభ్రష్టులైపోయినా మీరిలా కూచుని నిశ్చింతగా పేపరు చదువుకుంటారు.

నర——కులు మెవరికి ? భ్రష్టుత్వ మెవరికి ? అవి నీకూ నాకూను. పవిత్ర ప్రణయంతో నిండి పోయిన వారి అమృత హృదయాలలో ఈ తేలిక మాటలకి చోటు లేదు.

సుంద——నే ననుకొన్నంతా జరిగింది. జరుగుతోంది.

సుందరమ్మ కోపంతో లోనికి పోతూ వుంటే నరసింహారావు 'వెర్రిదాన!' అని అరుస్తూ, వికటంగా నవ్వుతాడు.

( తెర )